# స మ ర్ప ణ

రక్తిలోనూ

విరక్తిలోనూ

ఒకే రీతిగా భాసిస్తున్న

రాణికి.

# పాత్రలు :

**పురుషులు :–**

బిందు మాధవరావు (బిందు)

మధుసూదనరావు (మధు)

నటేశం

గోపాల్

ప్రసాదరావు

ఆరుముగం

**స్త్రీలు :–**

సుశీల

స్వర్ణమాల

శ్యామల

లక్ష్మి

యశోద

---

# 1

(డాక్టరు మధుసూదనరావు కన్సల్టింగ్ రూమ్. మధు అవని అనే పత్రిక చదువుతూ వుంటాడు.)

మధు: (పత్రిక చదవడం ఆపి) ఆరుముగం!

ఆరు: (లోపలనుంచే) సార్!

మధు: ఇవ్వాళ ఆ శ్యామలమ్మ ఏబ్సెస్ ఓపెన్ చెయ్యాలి. ఇన్స్ట్రుమెంట్సు బాయిల్ చేసిపెట్టు.

ఆరు: చేస్తున్నాను సార్. (వెళ్ళిపోతాడు. పోలీసు యిన్స్పెక్టర్ ప్రసాదరావు ప్రవేశం)

ప్ర: గుడ్‌మార్నింగ్ డాక్టర్ సాబ్!

మ: హల్లో ప్రసాదరావుగారా! ప్రభుత్వ సంరక్షకులు! ఉన్నవాటిల్లో కాస్త పెద్ద కుర్చీ చూసుకుని కూర్చోండి.

ప్ర: (గది కలయజూచి) సామ్యవాదుల యింట్లో కుర్చీల్లో మాత్రం వ్యత్యాసం కనబడుతుందండీ! మీరు డాక్టర్లేకాకుండా పెద్ద ఆర్టిస్టులు కూడా అయిపోతిరి!

మ: ఆర్టిస్టునని మెచ్చుకుంటే ఫరవాలేదుగాని, సామ్య

వాదినని జైల్లో మాత్రం పెట్టకండి. నేను సమతృవాదిని, సామ్యవాదిని కాను!

ప్ర: ప్రాణదానం జేసే డాక్టర్నే జెయిల్లో పెడతా మండీ ఎంత పోలీసువాళ్ళమయితే మాత్రం?

మ: అటువంటి అవసరంవస్తే పెట్టకుండా మానాారా?

ప్ర: డాక్టరుగారూ! మీరు చేసిన ఉపకారాలకు నాకెంత కృతజ్ఞత యేర్పడిందో మీకు తెలియదు. మీకోసం నేనేపనయినా చేయగలను. అదేదో కొత్త పత్రికలా వుంది?

మ: అవును. గోపాల్ అనే యువకుడు మంచి ఆదర్శా లతో యీ పత్రికను నడుపుతున్నాడు. పాపం, డబ్బులేక యిబ్బంది పడుతున్నాడు. అతనికెల్లా సహాయం చేయాలో తోచడం లేదు.

ప్ర: ఫిలిం స్టార్ల బొమ్మలు ఫ్రంట్ పేజీలో వేయ మనండీ, పత్రికలు పకోడీల్లా అమ్ముడుబోతయ్!

మ: నిజమే! ఫిలింస్టార్ల సహకారం లేకుండా ఏ సంస్థా జీవించలేదల్లే వుంది యీ రోజుల్లో!

(శ్యామల ప్రవేశిస్తుంది. వికృతంగా కనబడేఅంత నవ నాగరిక వేషం, చేగోడీలా జుట్టుముడి.)

శ్యా: అదేమిటండోయ్! ఫిలింస్టార్లు లేకుండా జీవించ లేమనుకుంటున్నారు?

ప్ర: ఔనండీ! ఫిలింస్టార్లిచ్చే విరాళాలూ, మీవంటి సంఘసేవికల అనుగ్రహం లేకుండా ఏం జరుగుతున్నది చెప్పండి యీ రోజుల్లో.

శ్యా: మనకి గిట్టనివాళ్ళ అరిష్టులు!

మ: ఘాటుగానే జవాబు చెప్పేరుగాని, ఆ అస్సాం బాధితులకు సహాయం మాట ఏమయినా ఆలోచించారా లేదా?

శ్యా: ఎక్కడండీ! హాలు సెక్రటరీతో మాట్లాడేను. ఒక భరతనాట్యమయినా పెడితేనేగాని విరాళాలు రావడం లేదండీ యీ రోజుల్లో. పేరున్నవాళ్ళని తీసుకొస్తే ఖర్చుల పేరుతో వచ్చిందంతా వాళ్ళే గుంజుకుపోతున్నారు. ఎవరయినా కొత్తవాళ్ళని చూడగూడదూ? అబ్బ! ఎన్నింటికని చావను?

మ: మీరిల్లా అంటారని తెలిసే ఒక కొత్త నర్తకిని కనిపెట్టేను.

శ్యా: ఎవర్తెబాబూ అంత పెద్దనర్తకి - నా నోటీసులోకి రాంది!

మ: (చేతిలో పత్రిక చూపిస్తూ) యీ పత్రికాసంపాదకుడి అప్పగారు.

శ్యా: పేరు?

మ: స్వర్ణమాల.

శ్యా: పేరు బాగానే వుంది.

మ: ఆమె రూపమూ నృత్యమూ కూడా బాగానే వుంటయ్.

శ్యా: ఉహ్హూ! అయితే వాళ్ళదేకులమండీ! ప్రొఫెసనల్సు కాదుగదా కొంపతీసి!

ప్ర: కళకీ కులానికీ సంబంధమేముందండీ?

మ: కులమత భేదాలుండగూడదని ఉపన్యాసాలిచ్చే

ఆవిడగాదూ! అడిగారు గనక చెబుతున్నాను. వాళ్ళు కళా వంతులు!

శ్యా: అల్లా చెప్పండి! కులవిద్యకు సాటిలేదు గువ్వల చెన్నా అని.

ప్ర: ఆ కులంలో ఆ వృత్తితో ఎవళ్ళూ జీవించడం లేదు సార్! ఈకాలం కళావంతులు వేరు. ఏమంటారు శ్యామలగారూ!

(శ్యామల చిమచిమ లాడుతుంది. గోపాల్ ప్రవేశం.)

గో: నమస్కారం గురూజీ! ఆలస్యానికి క్షమించాలి.

మ: క్షమించడానికేముందోయ్! మీ సిస్టర్ని కను క్కున్నావా!

గో: ఇటువంటి సేవాభాగ్యం లభిస్తున్నప్పుడు మూల కాదంటుందా!

మ: సంతోషం! (శ్యామలను చూపిస్తూ) ఈవిడ శ్యామలగారని ఆ ఎంటర్టెయిన్మెంటుకు ఆర్గనైజర్. (ప్రసాదరావును చూపిస్తూ) వీరు ప్రసాదరావుగారని మన సర్కిల్ పోలీసు ఇన్స్పెక్టరుగా వచ్చేరు.

గో: వారి పరిచయం అయినందుకు సంతోషిస్తు న్నాను.

శ్యా: మీ పరిచయమైనందుకు మాకూ సంతోషమే నండీ. నిజంగా యీ భూకంపం మీ సిస్టర్ నాట్యంచూచి ఆనందించడానికే వచ్చిందనుకుంటాను.

మ: ఆమె నృత్యం చూడడం కోసం భూకంపాలు రావాలని కోరకండి!

శ్యా: ఛాల్లెద్దురూ! భూకంపాలొస్తే నాకేం లాభం, చందాలు వసూలు చెయ్యడం తప్ప... ఇంతకీ యీ ఏక్సెస్ సంగతి మరచిపోయినారేమిటి? నాకు చాలా పనులున్నయ్, నేను పోవాలి.

మ: నిజంగా బాధపడేవాళ్ళెవరూ డాక్టరు దగ్గర ఇంతసేపు బాతాఖానీ కొట్టరు. అరుముగం! (అరుముగం ఒక ప్లేటులో ప్రవేశిస్తాడు. మధు లోషన్‌తో చేతులు కడుక్కుని శ్యామలచేతిమీద టించర్ రాయబోతాడు.)

శ్యా: అబ్బ! క్లోరోఫారమయినా యివ్వండి!

మ: గట్టి పొక్కంతకూడా లేదు. దీనికి క్లోరోఫారమా!

శ్యా: ఆడవాళ్ళ బాధలంటే అపహాస్యమూ వెటకారమూ! (శ్యామల మధువంక అల్లరిగా చూస్తుండగా మధు కత్తి ఝాడిస్తాడు) అమ్మయ్యమ్మయ్యమ్మయ్యో! ప్రాణం పోయింది. (నగలు నగలుగా యేడుస్తుంది.)

ప్ర: కాస్త ఓర్చుకోండి! (మధు కట్టుకడుతూ వుండగా బిందు మాధవరావు ప్రవేశం. మధు కట్టు ముగించి వెళ్ళి, బిందును ఆలింగనం చేసుకుని-)

మ: ఎప్పుడొచ్చావు బిందూ! ఒస్తున్నానని తెలియజేస్తే స్టేషన్ దగ్గిర కొచ్చేవాణ్ణిగా. (అందరివంకా చూచి) నా స్నేహితుడు, నాకు చదువు చెప్పించి యింతవాణ్ణి చేసినవాడు. దేవీపురంజమీందారు శ్రీ బిందు మాధవరావు.

ప్ర: నమస్కారం సార్. నేను ప్రసాదరావును. మీ సర్కిల్‌లో పనిచేశాను.

బిందు: (పారజూసి) అవును. మరచిపోయినాను.

మధు: (గోపాల్ను చూపిస్తూ) ఇతను గోపాలని ఒక స్నేహితుడు. నవీనాదర్శాలతో 'అవని' అనే పత్రిక నడుపుతున్నాడు.

గో: నమస్కారం!

బిందు: ఓ! ఇతన్ని గురించి నాకేదో రాసినట్లున్నావు.

మ: అవును.

గో: తమర్ని డాక్టరుగారు అభినందించని రోజంటూ వుండదు.

బిందు: మా మధూ పొగడ్తలకేంగాని (శ్యామలవంక చూస్తూ) పరిచయం పూర్తికాలేదు.

మ: ఈవిడ శ్యామలగారని యీ వూళ్ళో గొప్ప సంఘసేవకురాలు. నాగరికురాలని చూస్తేనే తెలుస్తోందిగా.

బిం: (శ్యామల చేయిచాస్తే ఆమె కరచాలనంచేస్తూ) ఎప్పుడో పట్నానికి వచ్చినప్పుడుగాని మావంటి పల్లెటూరి వాళ్ళకు మీవంటి వారి పరిచయం కలగదు!

మ: మా బిందూ ఎవరితోనూ ఇన్నిమాటలు మాట్లాడడండీ! మీరు చాలా ధన్యులే నిజంగా.

శ్యా: పెద్దవాళ్ళ ముందరగూడా కొంటె మాటలేనా?

మ: మా బిందూ పెద్దవాళ్ళలో పెద్దవాడు - చిన్నవాళ్ళలో చిన్నవాడు.

శ్యా: అల్లరివాళ్ళలో అల్లరివాడు కూడానా?

గో: నాకు శలవిప్పిస్తారా?

మ: వెళ్ళిరా గోపాల్!

గో: శలవు, (అందరికీ నమస్కరించి వెళ్ళిపోతాడు.)

ప్ర: నేనూ వెళ్ళొస్తాను డాక్టరుగారూ. రాజాసాహెబ్! శలవిప్పించండి (నమస్కరించి వెళ్తాడు.)

మ: శ్యామలగారూ! ఎల్లుండి నృత్యానికన్నీ సిద్ధం చేయించొద్దూ?

శ్యా: త్వరగా దయచెయ్యండని మర్యాదగా మంద లిస్తున్నారు! అంతేగా? స్నేహితులిద్దరూ ఏకాంతంలో వుంటారు గామల్ను! (మధుతో కరచాలనం అయిన తరవాత బిందూ చేయిపట్టుకుని, వగలాడిలా చూస్తూ) మళ్ళీ కలుసుకుంటా మనుకుంటాను. డాక్టర్! నృత్యానికి రాజాగార్ని కూడా తీసు కొస్తారుగా. శలవు. (గేటునద్ద వెనక్కు తిరిగి బిందువంక చూచి) చీరీయో. (వెళ్ళిపోతోంది.)

బిందు: ఎవరోయ్ యీవిడ?

మ: కనబడ్డంలా? కూర్చో.

(ఇద్దరూ కూర్చుంటారు.)

మ: నేను ప్రాక్టీసు పెట్టేక యిదేగా నువ్వు రావడం? సుశీల ఖులాసాగా వుందా? ఆమెను కూడా తీసుకురాక పోయి నావా?

బిందు: తీసుకొచ్చాను. ఆమె విషయం నీతో కన్సల్ట్ చేయాలని కూడా అనుకుంటున్నాను.

మ: (ఆందోళనగా) ఆదేమిటి, సుశీలకు సుస్తీగా వుందా? ఎక్కడుంది!

బిందు: బయట కారులో వుంది.

మ: అదేమిటి బిందూ? లోపలికి తీసుకొద్దాం రా.

బిందు: ఆమె లేకుండా నీతో రెండు మాటలు

చెప్పాలి. ఈమధ్య ఆవిడ ఓలా వుంటోంది. ఆహారం తీసుకోదు. మొన్న మా కుక్కయీనితే మా ఖాసాది ఆనందం పట్టలేక అమ్మగారి కడుపెప్పుడు ఫలిస్తుందో అన్నది. వెంటనే సుశీల మూర్ఛిల్లింది.

మ: ఐ సీ. సుశీలను తీసుకొద్దాం రా! (ఇద్దరూ బయటికి వెళ్తారు.)

(సుశీల, దాసీ యశోద, బిందు, మధు ప్రవేశం.)

సుశీల: (మీదవున్న ఉత్తరీయం యశోదకిచ్చి) నువ్వు కారులో వుండవే.

య: చిత్తం మారాణీ! (నమస్కరించి వెళ్లిపోతుంది.)

మ: కూర్చోమ్మా! ఇప్పుడెల్లా వుంది వంట్లో?

సు: సరే. నాకు జబ్బుగా వుందని చెప్పేరేమిటి ఖర్మం. నాకేం జబ్బు లేదు మధూ! ఏదో పైత్యంచేసి కళ్లు తిరిగి పడిపోతే దానికేదో పెద్ద రగడ చేస్తున్నారు.

మ: మూర్ఛలకు కారణం పైత్యం మాత్రమే అయితే నేనూ ఖంగారు పడను. (స్క్రీన్ వైపు చూపిస్తూ) ఒకమారిల్లా వస్తావా?

సు: డాక్టరుగారి ఆజ్ఞ. (లోపలికి వెళ్తుంది.)

(బిందూ చేతికర్ర నేలకు కొడుతూ సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ వుంటాడు. మధు బైటకు వచ్చి చేతులు కడుక్కుంటూ వుంటాడు.)

బిందు: (ఏమిటన్నట్లు చూస్తాడు.)

మధు: తరవాత చెబుతాను. (సుశీల ప్రవేశం.)

సు: అందరూ నాలాంటి పేమంళ్లే అయితే మధూ

ప్రాక్టీసు బాగానే వుంటుంది. ఏం వైద్యశిఖామణీ! ఈ గుండె లిల్లా కొట్టుకుంటూనే వుంటయ్యా?

మ: నాకీ చదువు చెప్పించిన మహాసాధ్వి హృదయం అంత తేలికగా ఆగిపోతుందా?

సు: అమ్మయ్య! అయితే అందరం యింటికెళ్ళి భోం చేద్దాం రండి.

బిందు: అప్పుడే యేం భోజనం? నేనూ మధు కలిసి శివెన్యూ బోర్డుదాకా వెళ్లివస్తాం. నీవు విశ్రాంతి తీసుకో.

సు: నాకేజబ్బూ లేదని మధూ అంత వాడు చెబుతూ వుంటే నన్నింకా పేషంటులాగే చూస్తున్నారేమిటి? మీా రిద్దరూ పని చూసుకొని త్వరగా రండి, ఆకలి మండిపోతోంది.

బిం: మంచిదే. ఈ మద్రాసు ధర్మమా అని మంద గించిన ఆకలి మండిపోతున్నది.

సు: మాటలకేమీా తక్కువ లేదు. మధూ! యీాయన్ను త్వరగా యింటికి తీసుకురా. త్వరగా రావాలి మరి. (వెళ్ళి పోతుంది.)

బిం: నలుగురిలో అల్లా చలాకీగా వుంటుంది. ఒంట రిగా వున్నప్పుడు ఏవో ఆలోచిస్తూ బాధపడుతున్నట్లు కని పిస్తుంది.

మధు: ఒంటరిగా ఎందుకుండనివ్వాలి?

బిందు: ఇంతకీ ఆవిడ మూర్ఛలకు కారణం కనిపెట్టేవా?

మధు: శారీరికమైన కారణాలేవీ కనిపించలేదు. బిందూ...

బిందు: ఏమిటి?

మధు: ఇది వైద్య విషయం! అడక్క తప్పదు. మీ దాంపత్యజీవితం ఆనందకరంగా వున్నదా?

బిందు: (మాట్లాడదు. కళ్ళల్లో బాధ కనిపిస్తుంది.)

మధు: క్షమించు బిందూ! నాకన్నా నీ కావ్వలెవరు, మీకన్నా నాకు ముఖ్యులెవరు?

బిందు: మధూ! కొందరు స్త్రీలనుచూస్తే ఏ విధ మయిన వాంఛా కలగకపోవడం సాధ్యమా?

మధు: ప్రతి స్త్రీ ప్రతి పురుషుణ్ణీ ఆకర్షించదు. అల్లాగే ప్రతి పురుషుడూ ప్రతి స్త్రీనీ ఆకర్షించడు. కొన్ని విశిష్టములయిన భౌతిక లక్షణాలూ, అనుకూలములయిన సాంఘిక మానసిక పరిస్థితులూ వుంటేనేగాని ఆ విధమయిన ఆకర్షణా వాంఛా ఏర్పడవు. కొందర్ని చూస్తే తల్లిలా పూజించాలనిపిస్తుంది. కొందర్నిచూస్తే యీమె నా చెల్లెలై వుంటే ఎంత బాగుండేది అనిపిస్తుంది.

బిందు: సుశీలను చూస్తే నాకల్లాగే అనిపిస్తుంది. మా అమ్మపోతే, మామయ్యగారియింట్లో మేమిద్దరం అన్నాచెల్లెలు లాగా పెరిగేము. సుశీల నెవరికయినా యిచ్చి చెయ్యమని మామయ్యగారినెంతో ప్రార్థించాను. అమ్మగారికిచ్చిన వాగ్దా నాన్ని పాటించీ, ఆస్తిలేనివాడికిస్తే ఇంట్లోనే వుంటాడని భావించి నాకిచ్చి చేశాడు. ఆనాడాయన మాట కాదనలేక సుశీల కన్యాయం చేశానేమోనని బాధపడుతున్నాను. అప్పు డప్పుడు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది.

మధు: (శ్రద్ధగా బాధగా వింటూ వుంటాడు.) ఛీ! అల్లా అనుకోకూడదు.

బిందు: అనుకోక చేసేదేమిటి? అదేమో నా సాంగ త్యానికి అలమటించిపోతుంది. నాకేమో యిల్లంటే పెద్ద పులిలా వుంటుంది.

మధు: చాలా దుఃఖకరమైన పరిస్థితే. ఒక్క ప్రశ్నకు సరిఅయిన సమాధానం చెప్పు. ఇతర స్త్రీలు నీలో ఆ కాంఛని ప్రేరేపిస్తారా?

బిందు: కొందర్నిచూస్తే ఏదో వికారం కలుగుతుంది. కాని సుశీలకివ్వలేని ఆనందం మరొకరికిస్తే ఆమె మరీ కష్ట పడుతుందని నా ప్రపంచంలో నేనుంటున్నాను.

మధు: అమ్మయ్య! అయితే కొంత ఆశ వున్నది.

బిందు: ఈ పరిస్థితి మారే సాధనమేమైనా వుందా?

మధు: నీ వైముఖ్యం అశక్తత నైసర్గికములైనవి కావు. శైశవంనుంచీ కలిసి పెరగడంవల్ల నీలో నీకు తెలియకుండానే ఒక సోదరభావం యేర్పడి నిన్ను విముఖుణ్ణి చేస్తున్నది.

బిందు: కావచ్చు. ఇది మారే మార్గాలు లేవా?

మధు: ఇటువంటి మానసిక వైపరీత్యాలు మందులతో మారవు. మనస్సును క్షుభితంచేసే పరిస్థితులు యేర్పడాలి. ఆ షాక్‌తో మనస్సే మారిపోవచ్చు.

బిందు: ఆ పరిస్థితులు ఏర్పడాలిగా?

మధు: బిందూ! ప్రేమించడం మానవ స్వభావం, దైహికసుఖం జీవితావసరం. దాని కాటంకం కలిగించే వ్యక్తుల్నీ పరిస్థితుల్నీ వాంఛావిదగ్ధులు ద్వేషించడంగూడా జరగవచ్చు.

బిందు: భయంకరంగా మాట్లాడుతున్నావు.

మధు: అవును బిందూ! సుశీల మనస్సును కష్టపెట్ట

వలసివస్తుందని నిన్ను నువ్వు చంపుకోడం మహాప్రమాదం. ఒక విషయం తప్పూ పాపం అనే భావన బలవత్తరంగా ఏర్ప డితే ఆ విషయంలో వైముఖ్యం అశక్తతా అసహ్యమూ కూడా ఏర్పడతవి. అప్పుడు ఆశే లేదు.

బిందు: అందుకని?

మధు: సుశీలకు తెలియకుండా నీ వాంఛలను నీవు

బిందు: ఛీ!

మధు: నేను అల్లరికి చెప్పడం లేదు బిందూ! ఈశ్వర సాక్షిగా చెబుతున్నాను. ప్రాణరక్షణకై మహాప్రమాదకర మైన ఆపరేషనుకు ఉద్యమించే సర్జన్‌లా చెబుతున్నాను. నువ్వు జితేంద్రియుడవైతే యిల్లా చెప్పివుండను. తెచ్చి పెట్టు కున్న మంచితనంతో నిన్ను నువ్వే అణచిపెట్టు కుంటున్నావు. అది మహాప్రమాదకరం.

బిందు: మరి సుశీల గతి ఏమిటి?

మధు: సహజ వాంఛలు మహత్తర శక్తులు. వాటికి మూడే పరిణామాలు. తృప్తి; నిరోధం; రూపాంతరం. ఆంగిక సుఖం సాధ్యం కానప్పుడు ఆభిమానిక సుఖం ఆనందహేతువు కావచ్చు.

బిందు: అంటే?

మధు: ప్రేమించిన వ్యక్తిప్రేమ లభించనప్పుడు శీలవతి అయిన స్త్రీ ఆ వ్యక్తికి సంబంధించిన సంస్థలమీదనో, వస్తు వులమీదనో తన ప్రేమను వర్షించి సంతృప్తి చెందుతుంది. తీరని మాతృప్రేమతో అలమటించిపోయే స్త్రీని ఏ ఆర్ఫనేజి

లోనో వుంచితే అక్కడవుండే పిల్లలమీద తన ప్రేమామృతం వర్షిస్తూ జన్మసాఫల్యం పొంది, తనకు పిల్లలు లేరన్నమాట మరచిపోతుంది. మీ దివాణంలో సుశీలకు ఏ వ్యాపృత్తీ లేదు.

బిందు: నేను చేయవలసిందేమిటో తెల్పడం లేదు.

మధు: సుశీల అభిరుచులకు అనుగుణంగా నీవు కొన్ని సంస్థలు స్థాపించు. వాటిలో నిన్నుచూచి సుశీల తన దుఃఖాన్ని కొంత మరచిపోతుంది. ఆవిడ ఏ వ్యాసంగమూ లేకుండా వుండడం చాలా ప్రమాదం.

బిందు: ఏం సంస్థలు స్థాపించమంటావు? పెట్టుబడి పెట్ట గలనేగాని బయటికిపోవడం మన చేతకాదే!

మధు: ప్రజాప్రభుత్వంలో పత్రికలు యిహ పరసాధ కాలు. గోపాల్ అవని నడపలేక బాధపడుతున్నాడు. ఆ పత్రిక నీవుకొని దినపత్రికగా మార్చు.

బిందు: అతన్నేం చెయ్యాలి?

మధు: సహాయసంపాదకుడుగా వుంటాడు.

బిందు: సంపాదకుడెవరు?

మధు: ఆ పని నేను నిర్వహిస్తాను.

బిందు: మరి నీ ప్రాక్టీసు?

మధు: నేను డాక్టర్నే కాదు, కళాశీలిని. కళ నా నెత్తురులో వుంది. అది నాకొక సహజవాంఛ. సహజవాంఛ లను చంపుకున్నవారు, జీవితంలో అభిరుచి నశించి, దేనినీ సాధించలేరు. నాకు రోగనివారణ అంటే విపరీతమైన యిష్టం

కాని, బాధాతురులను పీడించి జీవించడమంటే పరమ అసహ్యం. నీవొక ధర్మవైద్యశాలకూడా స్థాపించు. నువ్విచ్చే జీతంతో పొట్టబోసుకుంటూ ఉచితంగా మానవసేవ చేస్తాను. నీ జన్మా నా జన్మా తరిస్తయ్.

బిందు: నీమీాద పెట్టిన పెట్టుబడి దండగ కాలేదోయ్. నేను బాధ్యత వహిస్తాను అని నీవంటున్నప్పుడు నా కేసంకో చమూా వుండదు. నా జీవితం నీ చేతుల్లో వుంచుతున్నాను.

మ: నాకు పరమాప్తులైన మీా దాంపత్య సౌఖ్య నిర్మాణానికి నా సర్వస్వమూ సమర్పిస్తానని ప్రమాణంచేసి చెబుతున్నాను.

బిందు: ఇవన్నీ అక్కర్లేదు. సుశీల మనకోసం నిరీక్షిస్తూ వుంటుంది. పోదాం పద.

(తెర)

# 2

(స్వర్ణమాల యిల్లు, స్వర్ణమాల నిలువుటద్దంముందు నుంచుని నాట్యభంగిమములు అభ్యాసం చేస్తూ వుంటుంది. గోపాల్ ప్రవేశం.)

గో: సిద్ధంగా వున్నావుగద! పావుగంటలో వస్తున్నాను, రిహార్సల్‌కు సిద్ధంగా వుండమని గురూజీ టెలిఫోన్ చేశారు.

స్వ: ఏమో బాబూ! ఆయన యెదట రిహార్సల్ చేయడమంటే భయంగా వుంది.

గో: భయమెందుకు? ఆవేళ తుపానుబాధితుల సహాయార్థం నువ్వు నృత్యంచేసినప్పటినుంచీ డాక్టరుగారూ బిందు మాధవరావుగారూ కూడా నిన్ను మెచ్చుకోని రోజులేదు.

స్వ: మధూజీ మెచ్చుకోదగినంత కళ నాదగ్గిరేమీ లేదు.

గో: నీ కళను ఎంత మెచ్చుకోకపోతే గురూజీ బిందు మాధవరావుగారితో చెప్పి, నాట్యకళాశాల స్థాపించి దాని నిర్వహణకూడా నీకే అప్పగిస్తారు?

స్వ: అది వారికి మనమీదవున్న కృపావిశేషం! ఇంతకీ

యీ నాట్యకళాశాల స్థాపించే అభిప్రాయం డాక్టరుగారిదో, జమీందారుగారిదో తెలియడం లేదు.

గో: అభిప్రాయం ఎవరిదయితేనేం చేసినపని మంచిదైనప్పుడు?

స్వ: అల్లా కాదు గోపాల్! ఎంత మంచిపనైనా చేసే వారి సంకల్పం మంచిదికాకపోతే పాడయిపోతుంది. ఇది నిజంగా జమీందారుగారి ప్రోద్బలమే అయితే అందువల్ల చాలా చిక్కులు రావచ్చును.

గో: మధూజీ వున్నంతవరకూ మనకే చిక్కులూ రావు.

స్వ: ఆ మాటా నిజమేననుకో! అయినా జమీందారు గారికి, కళాసేనకంటే వినోదకాంక్షే అధికంగా కనుపిస్తుంది.

గో: అంతో యింతో వినోదకాంక్షలేకుండా కళా సేవకులు కావడం కష్టమేమో!

స్వ: ఇద్దరూ స్నేహితులే అయినా గురూజీకీ జమీందారుగారికీ ఎంతో భేదం వుంది. (అద్దంముందు నిలబడి, సవరించుకుంటూ వుండగా మధు వెనకనుంచి ప్రవేశిస్తాడు.)

స్వ: అబ్బ! అద్దం చీల్చుకుని బయటికి వస్తున్నారనుకున్నాను. (మధూ పాదాలకు నమస్కరిస్తుంది. గోపాల్ కూడా నమస్కరిస్తాడు.)

మ: ఎందుకమ్మా నాకంత పూజ్యత?

స్వ: నేను మిమ్మల్ని గురుదేవులుగానే భావిస్తున్నాను.

గో: మీరు కేవలం గురుదేవులే కాదు గురూజీ!

పాండవులకు కృష్ణభగవానుడెల్లాగో మాకు మీరూ అల్లాగే. ఈ స్వాతంత్ర్యం ఈ కీర్తిప్రతిష్టలూ కేవలం మీ అనుగ్రహం వల్ల కలిగినవేగా?

మ: మనకందరికీ ఆ అవకాశం కలిగించింది బిందూ ఔదార్యం. మన మందరమూ అతనికి కృతజ్ఞులమై వుండాలి.

స్వ: ఒక్క నిముషం క్షమించండి! (లోపలకు వెళ్తుంది.)

గో: బిందు మాధవరావు జమీందార్లలో తప్పబుట్టేడు గురూజీ! ఆ వజ్రాన్ని యిల్లా చెక్కినందుకు మిమ్మల్ని ఎంతగా అభినందించాలో తెలియడం లేదు.

మ: బిందూ జన్మతః ఉదారుడు గోపాల్!

గో: ఉదారుడేగానండి, మీకు కోపం రాకపోతే...

మ: (ఆదుర్దాగా) ఏమిటి గోపాల్?

గో: ఏమీ లేదు. మొన్న మన పత్రికా ప్రారంభోత్సవం నాటి పార్టీలో ఆయన ఆ శ్యామలమ్మకంత చనువివ్వడం నాకేమీ బాగా లేదు. సుశీలమ్మ కారుప్రక్కనే వున్నారు కూడా! ఆ శ్యామలమ్మ ఆయన్ను భంగపుచ్చుతుందేమో నని భయంగా వుంది.

మధు: అటువంటి వాళ్ళతో సంబంధం బిందూకు కొత్త. సంఘంలో చనువుగా ఉండకపోతే బాగుండదేమోనని అల్లా ప్రవర్తించి వుంటాడు. మాల అంతర్ధానమైపోయిందే!

స్వర్ణ: (లోపలనుంచే) ఒస్తున్నానండీ! ఒక్కక్షణం! (ఒక ట్రేలో రెండుగ్లాసుల పళ్ళరసంతో ప్రవేశించి) క్షమిం

చండి, మా యింట్లో కాఫీ టీ త్రాగే అలవాటులేదు. పళ్ళ రసం తీసుకోండి కొంచెం. (అందిస్తుంది.)

మధు: ఇదంతా సత్వగుణ ప్రధానంగా వుందే. కొన్నాళ్ళుపోతే కందమూలాలు తింటూ తపస్సు చేస్తావేమిటి ఖర్మం?

స్వర్ణ: చెయ్యకపోతే మాలాంటి వాళ్ళకు మోక్ష మెల్లా సిద్ధిస్తుంది?

మధు: నవ్వుతూ అన్నానమ్మా! ఎల్లుండి నటన నికేతనం ప్రారంభోత్సవం. నీవు చేయబోయే నృత్యం నీ గురుత్వాన్ని నిరూపించాలి. రిహార్సల్ చేస్తావా?

స్వ: గురుదేవుల దయ చల్లగావుంటే గురుత్వానికేం లోటు? (నృత్యంచేసి మధూ పాదాలుతాకి ఆగిపోతుంది.)

మధు: ఆజన్మ సిద్ధమయిన కళ నీది. నీకు సాధన కూడా ఎందుకు? ఈ నృత్యంచూచి మా బిందూ పరవశుడై పోతాడు.

స్వర్ణ: మీరు పరవశులైతే చాలు నాకు.

మధు: బిందూ మన కందరికీ జీవన ప్రదాత. అతని సంతృప్తి మనందరికీ జీవితాదర్శంగా వుండాలి. (గడియారం చూచి) ఆరయింది, ఇంకా బాగా సాధన చెయ్యి. గోపాల్! వెళ్ళొస్తానోయ్!

స్వర్ణ: అప్పుడే ఆరయిపోయిందా?

గో: గురూజీ సాన్నిధ్యంలో కాలమానం తెలియదులే. (మధు వెళ్తుంటే) నమస్తే గురూజీ!

స్వర్ణ: (మధు వెళ్ళినవైపే చూస్తూ) గురూజీ చాలా విచిత్రమయిన వ్యక్తి.

గో: ఏం?

స్వర్ణ: ఆయన కలిసిమెలిసి వుంటూనే దూరంగా వుండగలరు.

గో: కాకపోతే నీ సౌందర్యానికి ముగ్ధులై పాదాక్రాంతులౌతారేమిటి అందరూ?

స్వర్ణ: ఛీ! ఆయన పాదపూజ చేయవలసినదానిని.

(తెర)

# 3

(తాంబరంలో సుశీల వున్న యింట్లో పడుక గది. బిందు మాధవరావు అద్దంముందు నుంచుని క్రాపు సర్దుకుంటూ వుంటాడు. సుశీల తమలపాకులు వక్కలు పళ్ళెంలో పెట్టుకుని ప్రవేశిస్తుంది.)

సుశీల: ఏమండీ, వెళ్ళిపోతున్నారా అప్పుడే?

బిందు: అవును. ఆఫీసులో పనంతా పేరుకుపోయి వుంది. లక్షభారాలు నెత్తిన వేసుకున్నాను. అంతా చికాగ్గా వుంది.

సుశీల: అన్ని భారాలూ వహించడానికి మధు వున్నాడుగా, మీకెందుకా చికాకు?

బిందు: మధు వుంటేమటుకు. నేను లేకుండా ఏం జరుగుతుంది?

సుశీల: అయిదుపగళ్లూ అయిదురాత్రిళ్లూ అక్కడే వున్నారు–యిదంతా ఆఫీసు పనే?

బిందు: (తీక్షణంగా) మరి యింకేం పని చూస్తున్నాననుకున్నావ్?

సుశీల: ఎందుకండీ అంతకోపం, నేనేమన్నానని?

బిందు: మరేమిటి కుంటి ప్రశ్నలు?

సుశీల: గుడ్డి జీవితానికి కుంటి ప్రశ్నలుకాక మంచి ప్రశ్న లెలావస్తయ్ లెండి?

బిందు: నా జీవితం గ్రుడ్డిగానే వుంది.

సుశీల: నా జీవితం గుడ్డిగా వుందనుకున్నాను. ఎటు చూచినా ఫర్లాంగు దూరందాకా మనుష్యవాసన తగలదే. ఇక్కడ నేనాయశోద నొక్కదాన్నీ పెట్టుకుని ఎల్లాగండీ వుండడం? పోనీ పగలంతా అక్కడ పనులు చూసుకుని రాత్రి కన్నా యిల్లు చేరగూడదూ?

బిందు: (ఆలోచిస్తూ హఠాత్తుగా) నీ గొడవ నీదేగాని నా బాధ నీకెల్లా తెలుస్తుంది.

సుశీల: మిమ్మల్నేం బాధపెట్టేనండి? మిమ్మల్ని ప్రేమించడం గూడా బాధపెట్టడమేనండి? (గడ్డం పుచ్చుకుని) మీ మనస్సు కష్టపెడితే క్షమించండీ. మీకన్నా నాకేముం దండీ, యీ ప్రపంచంలో? (వీపుమీద చెయ్యివేస్తుంది.)

బిందు: (విసుగ్గా చేతిలో దువ్వెన విసరిపారేస్తాడు.)

సుశీల: (బాధగా) నేను మీ వంటిమీద చెయ్యివేస్తే గొంగడి పురుగులు పాకినట్లుగా ఉంటుంది గామల్ను! అవును, నేనేమన్నా అందగత్తెనా? చదువుకున్నదాన్నా? మీమీద నలుగురిలో ఎగబడి ఎకచకాలాడగలదాన్నా?

బిందు: ఇప్పుడల్లా ఆడేవారెవరు?

సుశీల: ఎవరో వున్నారనికాదు లెండి. అల్లా వుండ

గలిగితే మీ ప్రేమకు పాత్రురాలనయ్యేదాన్నేమో నను కున్నానంతే!

బిందు: (దీనంగా) సుశీలా! చెప్పేనుగా నా బాధ నీ కర్థంకాదని? నీవు నాకన్నా యోగ్యుడయినవాడికి భార్యవు కావలసిందానివి.

సుశీల: ఛీ! ఏమిటండీ అట్లా అంటారు? మీకన్నా యోగ్యులెవరు? మీ పాదాల సాక్షిగా చెబుతున్నాను. కావలిస్తే మీరు నాకన్నా యోగ్యురాలిని చేసుకుని సుఖపడండి. నాకు మాత్రం దూరంకాకండి. (అతని పాదాలు చుట్టేసి ఏడుస్తుంది.)

బిందు: (బల్ల నానుకుని విచారిస్తూ వుంటాడు.)

సుశీల: (లేచి) బాధ బాధంటారు? ఏవిటా బాధ? నేను పెట్టేబాధా? మీరు పడేబాధా? వంట్లో బాగుల్లేక బాధా?

బిందు: వంట్లో బాగుండక మంచానపడితే నాకూ నీకూ గూడా బాధలేకుండా పోవును. అట్లాగూ లేదు నాగతి.

సుశీల: ఇప్పుడు మీకేం గతి పట్టిందండీ? ఎందుకండీ నన్నిల్లా వేడిపిస్తారు? నేనేం పాపం చేశానండీ?

బిందు: నాకు భార్యవుగావడమే పాపమేమో? సుశీలా! నిన్ను కష్టపెట్టాలని నాకు మనసు కాదు. నీతో యీ విషయం ఎల్లా చెప్పాలో నాకు తెలియడం లేదు. అందుకని నాలో నేనే ఎన్నోరోజులు దుఃఖపడ్డాను. నీ ముందుకువస్తే నువ్విలా బాధపడతావనే ఇక్కడికి రావడంకూడా మానేశాను. నీకు

దూరంగా వుండాలనే యీ వ్యావృత్తులన్నీ పెట్టుకున్నాను. ఇక నన్ను గుచ్చి గుచ్చి వేధించకు.

సుశీల: హరిహరీ! ఎంత మాటన్నారండీ!(మంచంమీద పడి మూర్ఛిల్లితుంది.)

బిందు: యశోదా! యశోదా!!

యశోద: (వచ్చిచూచి) అమ్మగారిల్లా అయిపోయిం దేమయ్యా!

బిందు: ఏమి లేదు, అమ్మగారికి హిస్టీరియా వచ్చింది. నేనుపోయి మధుని పంపుతాను. నువ్వమ్మగార్ని జాగ్రత్తగా చూస్తూ వుండు.

యశోద: అయ్యా! నాకు బయమేస్తోందయ్యా! తమ రెళ్ళొద్దయ్యా.

బిందు: వెళ్ళక తప్పదు. (గబగబా వెళ్ళిపోతాడు.)

సుశీల: (మూర్ఛనుండి తేరుకుంటూ) వెళ్ళకండీ! వెళ్ళ కండీ!

యశోద: (సుశీల తల వొళ్ళో పెట్టుకుని) ఏం కర్మ మొచ్చింది మాతల్లీ!

(మధు చేతిలో విజిటింగు బాగ్ పట్టుకొని ప్రవేశం.)

మధు: ఇదేమిటి? ఏమయింది?

యశోద: అయ్యగారేదో అన్నారు బాబూ! అట్లా యిరుచుకుపడిపోయారు బాబూ! అట్లావున్న అమ్మగార్ని అట్లాగేవదిలి, మిమ్మల్ని పంపుతానని ఎల్లిపోయారు బాబూ!

మధు: (బాగ్ తెరిచి స్టెతోస్కోప్‌తో ఆమెను

పరీక్షచేసి) భయంలేదు యశోదా! అమ్మగారు మూర్ఛిల్లేరు. నువ్వెళ్లి కాస్త వేడి కాఫీపట్రా!

యశోద: చిటికెలో తెస్తాను బాబూ! (వెళ్ళిపోతుంది.)

సుశీల: (కళ్ళు తెరిచి మధుని చూచి, లేచి కూచుని) మధూ! మధూ! (వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

మధు: ఊరుకో—మ్మా! ఊరుకో! బిందూ ఏదో అన్నట్లుంది! ఆవూళ్ళో ఉండగానే బాగుండేదనుకుంటాను.

సుశీల: అక్కడవుంటే కళ్ళముందు కనబడుతూనన్నా ఉండేవారు. ఇప్పుడా అదృష్టమూ లేదు నాకు.

మధు: ఏం జరిగిందో నెమ్మదిగా చెప్పు.

సుశీల: ఏం చెప్పను? నామీద ఆయనకు యిష్టం లేదన్నారు. ఏమిటో బాధ బాధ అంటారు. నేను వేధిస్తానని యిక్కడకు రావడం మానేశానన్నారు. ఇంకేమేమో అన్నారు. ఇదంతా నాకేమీ అర్థంకావడం లేదు మధూ! ఇక్కడకొస్తే ఆనందిస్తాననుకున్నాను గాని యిల్లా అవుతుందనుకోలేదు. (కన్నీళ్ళు తుడుచుకుంటుంది.)

మధు: (తనలో అనుకున్నట్లుగా.) అదా సంగతి?

సుశీల: ఏమిటి మధూ! నీకేమయినా తెలిస్తే చెప్పవూ? ఆయనింకెవర్నయినా ప్రేమిస్తున్నారా?

మధు: ప్రేమించడమంటే యేమిటో అర్థమయితే బిందూ నిన్నిలా వ్యధపెట్టడు.

సుశీల: నువ్వేదో అర్థంకాకుండా మాట్లాడుతున్నావు! నేను నిజం తెలుసుకుని తీరాలి!

మధు: బిందూ మనఃప్రవృత్తి చాలా విచిత్రముగావుంది. అది నువ్వు సరిగ్గా అర్థంచేసుకోక బాధపడుతున్నావు.

సుశీల: ఆయన తల్లి పోతే మాయింట్లోనే పెరిగేరు. మేమిద్దరమూ ఒక తల్లిబిడ్డల్లా పెరిగేము.

మధు: అదే యీ విచిత్రవైఖరికి కారణమేమో!

సుశీల: ఏమిటి?

మధు: నువ్వు చిన్నపిల్లవయివుండగా బిందూ నిన్ను చంకనెత్తుకుని మోసి, నువ్వు మారాంచేస్తే సముదాయించి...

సుశీల: (సిగ్గుతో) ఊహూఁ మధూ! అప్పుడు నేనంటే ఆయన ప్రాణాలు విడిచేవారు.

మధు: ఇప్పుడూ విడుస్తాడు. మీరాయిద్దరూ కలసి పెరగడంతో నీమీద అతనికి సోదరభావం యేర్పడింది. నిన్ను స్త్రీగా, భార్యగా ప్రేమించలేకపోతున్నాడు. తన దౌర్బల్యం తనకే అర్థంకాక, ఆ మిషా యీ మిషా కల్పించుకుని నీకు దూరంగా వుంటున్నాడు. ఆ స్థితిలో నువ్వతన్ని చికాకుపెట్టడం మంచిదికాదేమో!

సుశీల: చికాకు పెడితే యేమొస్తుంది, విసుగూ నిర్లక్ష్యమూ తప్ప!

మధు: ప్రేమ మధురమైన ఉద్రేకంతో ఒకళ్ళకొకళ్ళు సమర్పించుకోవలసిన కానుక. నిర్బంధించి అమలు జరుపుకునే హక్కు కాదు.

సుశీల: ఆయన బాధేదో తెలిస్తే నేనెందుకు నిర్బంధిస్తాను మధూ! అయితే యీ జన్మకు నా ఖర్మమింతే నంటావా?

మధు: బిందూ ప్రస్తుత మనఃస్థితి సహజమైంది కాదు, అది ఒక మానసిక వైపరీత్యం.

సుశీల: అది మారే సాధనమేమీ లేదా?

మధు: అది మందులవల్ల ఆపరేషన్లవల్లా సాధ్యమయ్యే పనికాదు. అతని మనస్సునీ హృదయాన్నీ సంక్షుభితంచేసే సంఘర్షణమో, సన్నివేశమో ఏర్పడ్డప్పుడు, అతని మనస్థితి మారిపోవచ్చును.

సుశీల: అల్లా ఎక్కడయినా, ఎప్పుడయినా జరిగిందా?

మధు: అనేకమార్లు జరిగింది. అతని ప్రస్తుత జీవితం అటువంటి సంఘర్షణలకు దారితీయవచ్చును కూడా. అంత వరకు నువ్వతన్ని మన్నించి ప్రేమించు.

సుశీల: నేనాయన్ను ప్రేమించడం లేదా మధూ!

మధు: ప్రేమిస్తున్నావు కాని, అందుకు ప్రతిఫలంగా అతనివ్వలేనిదాన్నభిలషించి బాధపడుతున్నావు. నిజమయిన ప్రేమ నిష్కామకర్మ. ప్రేమమూర్తిమీద కలిగే నిర్హేతుక జాయమానమైన భక్తి. అటువంటి ప్రేమకు ప్రేమించడమే పరమావధి. ఆ ప్రేమకు ప్రతిఫలాపేక్ష వుండదు. (సుశీల తదేక ధ్యానంతో వింటూ వుంటుంది.)

ఈ ప్రేమతత్వాన్నే అనాదినుంచీ, అన్ని దేశాల్లో ఆదర్శప్రేమమూర్తులు అర్థంచేసుకుని పతిహింసను ప్రేమతో ఎదుర్కొని, భర్తహృదయంలో శాశ్వతమయిన పరివర్తనం కలిగించి, సుఖాన్నీ యశస్సును కూడా ఆర్జించుకున్నారు.

ఈ విధానావలంబనలో భారతస్త్రీలు అగ్రగణ్యులనిపించు కున్నారు.

ఆ ప్రేమ విధానాన్నే గాంధీజీ కూడా అవలంబించి ప్రబలశత్రువులను మిత్రులుగా మార్చి భారతదేశానికే విముక్తి సమకూర్చేడు. హింసించిన వారినే త్రికరణశుద్ధితో, నిస్వార్థంగా ప్రేమించడమే సత్యాగ్రహం. ఆ దృష్టితో చూస్తే భారతస్త్రీ ఆదిసత్యాగ్రహి.

సుశీలా! నువ్వూ ఆ ప్రేమతత్వాన్నే అర్థంచేసుకుని సత్యాగ్రహివికా! అతనువస్తే ఆదరించు. రాకపోతే దుఃఖ పడకు. అతని ఆనందమే నీ ఆనందంగా పరిగణించు. పవిత్ర మయిన స్నేహవాత్సల్యంతో నేను నిన్నాశీర్వదిస్తున్నాను. ఎప్పుడో బిందూ నిన్ను ప్రేమించి తీరుతాడు.

సుశీల: ప్రేమిస్తారా?

మధు: తప్పకుండా. (యశోద కాఫీ తెస్తుంది.)

(తెర)

# 4

(బిందు బంగళాముందు వరండా. ఒక పేము టీపాయ్, దానిచుట్టూ మూడు కుర్చీలు, ఏష్ ట్రేలోనుంచి, కాల్చి పార వేసిన సిగరెట్ ముక్కలపొగ. బిందూ ఆపకుండా సిగరెట్ కాలుస్తూ వుంటాడు.

పనిమనిషి లక్ష్మి-20 సంవత్సరములు-అందమైంది - వచ్చి తొంగిచూచి లోపలికి పోతుంది. శ్యామల ప్రవేశం. బాగా అలంకరించుకొని వుంటుంది. బిందూ వెనకనుంచి వచ్చి అతని కళ్లు మూస్తుంది.)

బిందు: ఎవరది! (తడిమి) శ్యామలగారా?

శ్యా: కనుక్కున్నారే?

బిందు: నాతో ఆ మాత్రం చనువుతీసుకోగలవాళ్లు మీరొక్కరేగా?

శ్యా: అల్లా అంటే నేను నమ్ముతాననే!

బిం: నమ్మకపోతే మానెయ్యండి, కూర్చోండి.

శ్యా: (కూర్చుని) అమ్మయ్యో, రోజుకిన్ని సిగరెట్లు కాలిస్తే యింకేమయినా వుందీ? (ఒక సిగరెట్ తీసుకుని)

కాలిస్తే ఏమీ అనుకోరుగద! (సిగరెట్ నోట్లో పెట్టుకొని నిప్పుపుల్ల వెలిగించి తాపీగా ముట్టించి అతనివంకే చూస్తూ పొగ అతనిమీదకే వదులుతుంది.)

బిందు: (మొదట్లో నిర్ఘాంతపోయినా తరువాత తనూ ఒక సిగరెట్ తీసి, కాలుస్తున్న సిగరెట్‌తోనే ముట్టించి) నిజంగా సిగరెట్ ఆపద్బాంధవుడివంటిది.

శ్యా: కాదండీ,కష్టాలు వొదలించే గరళ్ ఫ్రెండువంటిది.

బిందు: (మళ్ళీ నిర్ఘాంతపోయి వుండాగా) అల్లాగే!

శ్యా: ఏమిటి బాబూ! ఓడిపోయిన మినిష్టర్లా మొగం వేళ్ళాడేసుకు కూచున్నారు?

బిందు: ఏదో స్వంత విషయాల్తో మనస్సు చికాకుపడి ఆలోచిస్తున్నాను. క్షమించండి.

శ్యా: స్వంతవిషయాలంటే యితరులు తెలుసుకోగూడని వనేగా?

బిందు: అల్లాగే.

శ్యా: ఆ జమీందారి హోదా తగ్గించి మాతో కాస్త మనుషుల్లా మాట్లాడుదురూ.

బిందు: నా జమీందారీ ప్రభుత్వంవాళ్ళు కాజేసేరు. నేనూ మీలో జమే.

శ్యా: (తన వక్షంమీద చెయ్యిపెట్టి చూపుతూ) మాలో జమే, మా–లో?

బిందు: ఆహా–మీలోనే.

శ్యా: (నిజంగానే అంటున్నాడా అన్నట్లుగా అతనివంక క్షణంసేపు చూసి) అయితే సిటీకి వచ్చి నెల్లాళ్ళకు పైన అయింది గదా, ఇంకా కారు కొనకపోతే ఎల్లాగండీ?

బిందు: ఏదో పేదవాళ్ళం.

శ్యా: ఓహ్హోహ్హో! పేదవాళ్ళు పాపం. ఎందుకండీ అంత పరాచికం—మేము పేదవాళ్ళమనేగా?

బిందు: ఛీ. నవ్వుతూ అన్నాను, కోపగించుకోకండి. రాంగానే ఆర్డరు చేశాను. రెండు మూడు రోజుల్లో యిస్తా మన్నారు కంపెనీవాళ్ళు.

శ్యా: ఆ సంగతి నాతో ఫోర్డు కంపెనీ మేనేజరు చెప్పేడు లెండి. అయితే మీ కారు మీరే డ్రైవ్ చేసు కుంటారా?

బిందు: లేదండీ, నాకు డ్రైవింగు రాదు.

శ్యా: సిటీలో మీలాంటి వాళ్ళకు డ్రైవింగ్ రాకపోతే చిక్కే—నే.

బిందు: మాలాంటి వాళ్ళంటే?

శ్యా: మహా తెలియనట్లు.(అతని వీపుమీద చరుస్తుంది.)

బిందు: (ఉలిక్కిపడి) ఎప్పుడో ఓ మాటు బస్తీకి వచ్చేవానికి నాకేం తెలుస్తుందమ్మా సిటీ సంగతి ?

శ్యా: అయితే మేమిక సిటీ చదువంతా మీకికమీదట నేర్పాలిసిందే?

బిందు: మీరు నేర్పితే తప్పకుండా నేర్చుకుంటాను.

శ్యా: (కొంటెగా) ఏమిస్తారు నేర్పితే?

బిందు: (అంతకన్నా కోంటెగా) మీరు నేర్పిందాన్ని బట్టి యిస్తాను.

శ్యా: అబ్బ! ఇప్పటికి నవ్వేరు బాబూ! రాంగానే చూచి ఏదో తుపానులా వుందే అని భయపడ్డాను. అవును గానీ, డ్రైవింగ్ రాదన్నారు గదా మరి డ్రైవర్నెవర్నయినా ఏర్పాటు చేశారా?

బిందు: నాకిక్కడ ఎవరూ తెలియదండీ! పేపరులో వేద్దామనుకుంటున్నాను.

శ్యా: పేపరులో వేస్తే పెళ్ళి కుదిరినట్లే, డ్రైవరు దొరికి నట్లే! మీకు తెలియదుగానీ, నా మాట వినండి. నాకు తెలిసిన డ్రైవర్నొకర్ని యిక్కడకు వచ్చి కలుసుకోమన్నాను - నా మాట తోసెయ్యరు గదా అని...ఇంకేమీ యియ్యకపోతే మానె, కాస్త టీ అయినా యివ్వగూడదూ.

బిందు: మీ మాట తీసెయ్యను గదా అనే నమ్మకం కుదిరిన వారికి; ఏమీ యివ్వనుగదా అనే సందేహం ఎల్లా కలిగింది? అడిగిందల్లా దానంచేసే సాంప్రదాయంలో వాళ్ళం.

శ్యా: థ్యాంక్స్! అడిగిందల్లా యిస్తామన్నారుగా, చూస్తాను ఏమేమిస్తారో. అందుకనే నమ్మకమైన డ్రైవర్ని కుదిర్చాను. డ్రైవరు నమ్మకమైనవాడు కాకపోతే బండారం బయటబడుతుంది...కాస్త టీ పోయిద్దురూ తలకాయ పగిలి పోతోంది.

బిందు: అరె! మరచిపోయినాను...లక్ష్మి!

(లక్ష్మి వస్తుంది. శ్యామల ఆమె వంక ఎగా దిగా చూస్తుండగా) టీ బిస్కట్లూ అవీ పట్రా! (లక్ష్మి వెళ్తుంది.)

శా: ఫరవాలా! మంచి టేస్టే! మీ పూరినించే తెచ్చే రేమిటి ?

బిందు: లేదు. ఈ పూరిమనిషే! (కొంచెం కోపంగా) దాసీ దానిదగ్గర టేస్టేమిటండీ!

శ్యా: ఊఁ! అంతలోనే కోపం. మంచి టేస్టున్నవాళ్లు ప్రతి చిన్న విషయంలోనూ ఆ టేస్టు చూపిస్తారు. అసహ్యంగా వున్న మనిషి చేసిన టీకీ, అందంగా వున్న మనిషి చేసిన టీకీ భేదముండదేమిటి? ఇవ్వాళ దాసీదే ముక్కూ మొగమూ సరీగ్గా వుంటే రేపు ఫిలింస్టారై కూర్చుంటుంది. దాంతో దాని వెనక బాకాలు ఊదడానికి రాజాలంతా బార్లుకట్టి నుంచుంటారు. దాసిదట! దాసీది!!

బిందు: ఆ మాటా నిజమే లెండి!

(నటేశం ప్రవేశం.)

న: దండమండయ్యా! దండమండమ్మా!

శ్యా: ఓ నటేశం! ఇతనేనండీ నేను చెప్పిన డ్రైవరు. పాపం చాలా మంచి కుటుంబంలోనుంచే వచ్చాడు. అరవమూ తెలుగూ బాగా వచ్చు. ఇంగ్లీషు అర్థం చేసుకుంటాడు. పాదరసంలాంటి బుద్ధి. కావాలంటే కొండమీద కోతినికూడా తీసుకొస్తాడు.

న: నా సమాచారమంతా అమ్మకు బాగా తెలుసునండి. శానా పెద్దపెద్దవారి దగ్గర పనిచేశానండి. ఏదో...

శ్యా: (ఊరుకోమన్నట్లు సౌజ్ఞచేస్తే-)

న: మీ దయండి!

బిందు: ఎంత జీతంకావాలో కనుక్కోండి.

శ్యా: కనుక్కోడమేమిటి, మీ యిష్టం!

బిందు: నందరూపాయలిస్తాము. రేపటినుంచీ పనిలో చేరమనండి. లక్ష్మీ! యీ ట్రే తీసుకుపో!

(లక్ష్మి వచ్చి ట్రే తీసుకుపోతుంది. నటేశం దానివంక ఎగా దిగా చూస్తుంటే–)

శ్యా: నటేశం! నువ్వికవెళ్లు. రేపటినుంచీ పనిలో చేరు.

న: దండమండయ్యా! శలవండమ్మా! (వెళ్తాడు.)

శ్యా: ఏమండీ...

బిందు: ఏమిటి?

శ్యా: ఏమిటోనమ్మా అడుగుదామనుకున్నాను. ఆc! మీ నటన నికేతనం ప్రారంభోత్సవం చాలా బాగా జరిగిందండీ! ఎల్లా వున్నారు నృత్యమూ నర్తకీ?

బిందు: ఒకళ్ళకొకళ్ళు తగి వున్నారు.

శ్యా: నిజంగా స్వర్ణమాల చాలా అందమైంది కాదూ?

బిందు: మీకన్నానా?

శ్యా: నేను స్వర్ణమాల అంత అందంగా వున్నానా ఏమిటి? అంతా పొగడ్త!

బిందు: ఏ పుష్పం అందం ఆ పుష్పానిదే.

శ్యా: పుష్పాల మధ్య భేదముండదేమిటి? అయితే తుమ్మెదలన్నీ ఒకటే లెండి. ఏమంటారు?

బిందు: పుష్పం దొరికితే తుమ్మెదలు మకరందం తాగుతవి.

శ్యా: పుష్పం దొరికితే ఈ తుమ్మెద మకరందం తాగు

తుందన్నమాటేం? (అతనివంక చూస్తూ తల ఆడిస్తూ) నిజంగా మీరు చాలా అదృష్టవంతులండీ!

బిందు: ఏం?

శ్యా: ఇంత చక్కని పెర్సనాలిటీ, కావలసినంత డబ్బు, ఏ జోక్యం కలిగించుకోని భార్య, పుష్పాలు దొరికితే మకరందం త్రాగే స్వభావం...

బిందు: పుష్పమంటూ దొరికితేగా యిదంతా?

శ్యా: మీరు తలుచుకుంటే పుష్పమే దొరకదూ, ఒక టేమిటి? రకరకాల పుష్పాలూ దొరుకుతయ్!

బిందు: ఒక తుమ్మెదకే అనేక పుష్పాలు దొరికితే, వాటి మధ్య ద్వేషం ఏర్పడదూ?

శ్యా: గడుసువాళ్ళే! ఏమోననుకున్నాను. అదంతా ఆ తుమ్మెదను బట్టి వుంటుంది! ఇల్లేమయినా ఫర్నిష్ చేశారా లేక యింకా మొగసంసారంలాగే వుందా?

బిందు: రండీ చూద్దురుగాని(అని లోపలకు దారితీస్తాడు.)

శ్యా; ఇంకా ఆ రండీ ఏమిటి గిండీ.

(ఇద్దరూ లోపలికి పోతారు.)

(తెర)

# 5

(స్వర్ణమాల యిల్లు. మాల నృత్యం ప్రాక్టీసు చేస్తూ వుంటుంది. గోపాల్ కుర్చీమీద కూర్చుని తాళంవేస్తూ వుంటాడు.)

స్వర్ణ: (కాసేపు నృత్యంచేసి కుర్చీలో కూలబడి) అమ్మా!

గో: అదేమిటి మాలా, అలిసిపోయినావా?

స్వ: ఏమిటో యిప్పుడెక్కువసేపు నృత్యం చేయలేకుండా వున్నాను గోపాల్! కొంచెం సేపు చేస్తేనే ఆయాసం వచ్చేస్తోంది.

గో: అవును. ఈ మధ్య చాలా చిక్కిపోయినావు కూడా. ఒకమాటు గురూజీచేత పరీక్ష చేయించుకో కూడదూ?

స్వ: ఫీజు పుచ్చుకోకుండా మందులిచ్చే డాక్టర్ల వైద్యం పనిచెయ్యదు.

గో: ఆయన ధర్మహాస్పత్రిలో బాగానే పనిచేస్తున్నదే!

స్వ: అక్కడ వాళ్ళ రోగాలు వేరు. (నిట్టూర్చి లేచి

అద్దం ముందు నుంచుని ముంగురులు సవరించుకుంటూ వుంటుంది.)

గో: మందులతో కుదరని కొత్త కొత్త వ్యాధులు తెచ్చుకుంటే మనవంటి వాళ్ళకు కష్టమే నే.

స్వా: కాదా మరి! స్వతంత్ర భారతంలో కూడా కులాలూ మతాలూ యింకా బలవత్తరంగానే వున్నయ్.

గో: ఉంటే వుండవచ్చునుగాని ప్రేమశక్తి ముందు మందూ తుపాకీ లేకుండా హతమారిపోతున్నయ్.

స్వా: అసలు ప్రేమంటూ వుంటే దానికో శక్తంటూ వుంటుంది.

గో: మాలా! ఆదర్శాలవల్ల మనస్సుకు వేసుకున్న సంకెళ్ళను ఆ కులవిభేదాలకు అంటగట్టకు. గురూజీ వాటన్నింటికీ అతీతుడు!

స్వా: ఇప్పుడు మీ గురూజీ మాట ఎవరెత్తేరేమిటి?

గో: మన గురూజీని ఒకమాటు రమ్మని ఫోన్ చేసి వస్తాను.

స్వా: ఒద్దు గోపాల్! ఆయన చాలా బిజీగా వుండి వుంటారు.

గో: ఎవరయినా బాధపడుతుంటే ఎంత బిజీగా వున్నా వస్తారులే. (వెళ్తాడు.)

స్వా: (డ్రాయరు తెరిచి మధూ ఫోటో తీసి చూస్తూ) మీకు కులవిభేదాలు లేవా గురూజీ! ఈ విముఖత్వం అంతా యిష్టంవుండీ లోకం ఏమయినా అనుకుంటుందనేనా? ఎందు

కమ్మా లోకమంటే మీకింత భయం? నాకన్నా ఈ లోకం ఎక్కువేమిటి?

ఏమిటి దీనికింత స్వార్థం అనుకుంటున్నారా...అవును, చక్కని పండు వెన్నెల నా వొక్కదానిమీదే పడాలనుకోడం స్వార్థమే!

(బయట పద ధ్వనులు. మాల తత్తరపాటుతో ఆ ఫోటో డ్రాయర్లో పెట్టి మూసేస్తుంటే మధూ, గోపాల్ ప్రవేశం.)

స్వ: అప్పుడే ఫోను అందడం రావడంగూడా జరిగిందే!

మ: అదే వరి! వాయువేగ మనోవేగాలతో ఊడి పడ్డానన్నమాట!

స్వ: అబ్బ, అరిచేతుల్లో వైకుంఠం చూపిస్తారు పాపం! ఇక్కడికి రావాలనే వస్తున్నారు. ఫోన్ మెస్సేజ్ అందికాదు. ఔనా? అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారు.

మ: (కూర్చుని) పుడితే సీలా తయారుచేస్తాను.

గో: గురూజీ! కొంచెం క్రితం మాల ఏమన్నదో తెలుసా? ఫీజు పుచ్చుకోకుండా డాక్టర్లు మందిస్తే వ్యాధి నయం కాదుట!

మ: పళ్ళరసం త్రాగమను, నయమౌతుంది! ఇంతకీ ఏమిటి వంట్లో సుస్తీ?

స్వ: సుస్తీగా వుందని ఎవరు చెప్పేరు?

గో: నేనే! నృత్యంచేస్తూ అలసి కూలబడిపోయింది గురూజీ! ఎన్ని గంటలు నృత్యంచేసినా అలసట ఎరగని మనిషి. అలా డస్సిపోతే ఏమనుకోవాలి? చిక్కి సగమైపోయింది చూశారా? ఇహ రాత్రిళ్ళు నిద్రపోదు.

స్వ: ఊరుకో గోపాల్! నేను నిద్రపోకపోవడం నీవు చూశావా?

గో: నిన్న ఎన్నింటికి నిద్రపోయినావో చెప్పు!

స్వ: నిన్న ఏదో చదువుతున్నాను.

గో: మొన్న?

స్వ: ఏమిటీ పితూరీలు?

గో: మన కన్నింటికీ గురూజీయే. ఆయనతో కాక పోతే మరెవరితో చెప్పుకుంటాం?

మ: మనిషిని చూస్తే ప్రబలమైన శారీరికవ్యాధి ఏదీ వున్నట్లు కనిపించడంలేదు. అయినా పరీక్ష చేయకుండా రోగం లేదంటం వైద్యధర్మంకాదు. చూద్దాం. ఆ కుర్చీమీద కూర్చో మాలా!

స్వ: నాకేం జబ్బండీ, ఎవరయినా నవ్వుతారు.

మ: ఎవరో నవ్వుతారని నా విధి నేను మాన్తానా?... కూర్చోవమ్మా!

గో: పరీక్షచేయనీ మాలా! ఏమిటా పేచీ?

స్వ: సరే! (ఇష్టంలేనిదానిలాగా కూర్చుంటుంది.)

మధు: (పరీక్షచేసి స్టెతోస్కోపు మెళ్ళోవేసుకుని ఆలోచిస్తూ వుంటాడు.)

స్వ: అయిందా పరీక్ష!

మధు: సైతోస్కోప్ కేమీ అందడంలేదు. అంత రంగంలో నాటుకుని ఉందో ఏం ఖర్మమో.

స్వా: ఖర్మమల్లేనే వుంది.

మధు: అంతరంగంలో వ్యాధి ఏర్పడితే, దాన్ని సూచించే సాక్ష్యం పరిసరాల్లో దొరుకుతుందంటారు శాస్త్రజ్ఞులు! అటువంటిదేమయినా ఈ డ్రాయర్లో దొరుకుతుందేమో.

స్వా: అయ్యయ్యో! అది తియ్యొద్దండి. నా మాటవినండి. ఒద్దు, ఒద్దు. (అని అతని చేయిబట్టుకుని వెంటనే వదలి) క్షమించండి!

మధు: పోనీలే నీ రహస్యం నేనెందుకు బయటపెట్టాలి?

స్వా: నాకు రహస్యమేమీ లేదు. కావలిస్తే చూడండి!

మధు: (డ్రాయర్లో ఫోటోతీసి తనదని తెలుసుకుని నిర్విణ్ణుడౌతాడు. గోపాల్ ఖంగారు పడి–)

గో: పళ్ళరసం తీసుకొస్తాను. (వెళ్తాడు.)

స్వా: (భయంగా కంగారుగా పెదిమె కొరుక్కుంటూ నిలబడి కాలిబొటనవ్రేలితో నేల రాస్తూ వుంటుంది. మధు ఆ ఫోటో డ్రాయర్లోపెట్టి మెల్లిగా మూసి ఆలోచిస్తూ వుంటాడు.)

స్వా: క్షమించండి. అపరాధమేమో!

మధు: ఇందులో క్షమించడానికేముంది?

స్వ: రక్షించారు.

మధు: కోపగించుకోనంటే రెండు మాటలు చెబుతాను.

స్వ: నాకా, కోపమా, మీమీదా!

మధు: మానవప్రపంచమంతా ప్రేమించి ప్రేమించబడనివాళ్ళతో నిండిపోతోంది. నీకా ఫోటో ఎక్కణ్ణుంచి వచ్చింది?

స్వ: తపస్సుచేస్తే దేవతలిచ్చిపోయినారు! ప్రెస్ ఫోటోగ్రాఫర్నడిగి గ్రూపులో మీ ఫోటో ఎన్లార్జి చేయించుకుంటే వచ్చింది.

మధు: ఎందుకంత శ్రమ?

స్వ: ఖర్మ!

మధు: ఈ ప్రపంచంలో సర్వానికీ కర్మ ప్రధానము. కర్మతత్వం అర్థమైతే మనస్సు సుఖదుఃఖాలకు అతీతమైపోతుంది.

స్వ: మీకాతత్వం అర్థమైంది, హాయిగా శాంతంగా కడుపులో చల్ల కదలకుండా కూర్చున్నారు. అర్థంకాని మావంటివాళ్ళు మమకారంతో బాధపడుతున్నారు.

మధు: నేనంత హాయిగా కూర్చున్నానని నీకెల్లా తెలుసును?

స్వ: (ఆదుర్దాగా) అయితే అల్లా లేరా చెప్పండి?

మధు: మాలా! మన జీవితాలు కళాదేవత కంకితాలు.

కళా ప్రపంచంలో ఉండేవాళ్ళందరకీ యిటువంటి సంబంధాలు ఏర్పడతవనే నింద ప్రపంచంలో వుంది. మనమూ అటువంటి నిందకే ప్రోద్బలం కలగజేస్తే మన ఉద్యమమే పాడయి పోతుంది. ఒక ఆదర్శంతో నా హృదయం శిలా శైల శంఖాదకర్కశమైపోయింది. కావాలనుకుంటే నీ కోమల హృదయాన్ని మరొకరికిచ్చి...

స్వ: మరొకరు కావాలనుకుంటేగా మీ సలహాతో అవసరం.

మధు: ప్రేమయిచ్చే దివ్యానుభూతి ప్రేమించడంలోనే వుంది. హృదయాల్లో అంకురించిన ప్రేమ, శారీరికం కానప్పుడు మనస్సుకు ఒక ఉత్తేజాన్ని ఉద్వేగాన్ని కలిగించి ఒక మహానందాన్ని చవి చూపిస్తుంది. తీరిన కోరికల్లోకంటే తీరని కోరికల్లోనే తీపి యెక్కువ.

స్వ: పోనీండి, మిమ్మల్ని ప్రేమించడమే తప్పనడం లేదుగా.

మధు: ఏ ప్రాణికీ హింస కలిగించనంతవరకు ఏ పనీ తప్పుకాదు. నీ ప్రేమకు ప్రతిఫలంగా నేనివ్వదగిందేదీ లేదు. నీ సాన్నిధ్యంలో ఉత్తేజాన్ని పొంది, కళాసృష్టి కళాసేవా చేస్తాను. కాని, నువ్వంత త్యాగం చేయడం దేనికి?

స్వ: ప్రేమకోసం. మీ ప్రేమతత్వం మహోత్కృష్టమైంది. ఆ తత్వాన్నే నేనూ జీర్ణించుకుని ముక్తిపొందడానికి ప్రయత్నిస్తాను.

మధు: అంత కఠోరదీక్ష వహించగలిగితే అల్లాగేవుండు. నీ భంగిమములకు నా భావాలూ, నా భావాలకు నీ భంగిమములూ అంకితములై పోనీ. (గోపాల్ మూడు గ్లాసులనిండా పళ్ళరసం తెస్తాడు.)

స్వ: (ఒక గ్లాసు మధుకి యిచ్చి, ఒకటి తను తీసుకుని) త్రాగండి. ఆదర్శ సంఘర్షణలతో తత్వం వేడెక్కిపోయి వుంటుంది. ఇకమీదట సాత్వికాహారమే శరణ్యం.

మధు: సాత్వికాహారం మానసికానందాన్ని కలిగిస్తుంది.

స్వ: మానసికానందంతో నా హృదయ మయూరం నాట్యం చేస్తుంది. చూస్తారా?

(మాల నృత్యం చేస్తుంటే మధు, గోపాల్ గ్లాసులు పుచ్చుకుని అల్లానే చూస్తూ వుంటారు తన్మయులై.)

(తెర)

# 6

(బిందు మాధవరావు యింటి వరండా. టీపాయ్‌మీద లక్ష్మి ఫలహారాలు అమరుస్తూ వుంటుంది. నటేశం వెనకనుంచి ప్రవేశించి దానిమీద చెయ్యివేస్తాడు.)

లక్ష్మి: (ఉలిక్కిపడి) అయ్యగారూ, అయ్యగారూ!

న: ఏయ్, ఎందుకట్టా అరుస్తావ్?

బిందు: (లోపలనుంచే) ఎందుకే అట్లా అరుస్తావ్?

ల: ఈ నటేశం చూడండయ్యా, పోకిరీయేషాలేస్తు న్నాడు. యిట్టా అయితే నేనెల్లిపోతానండి.

బిందు: (లోపలనుంచే) ఎందుకురా దాన్నట్లా యేడి పిస్తావ్?

న: ముందేడిపిస్తే తరవాత నవ్వించొచ్చండి.

ల: నువ్వు నన్నేడిపించకేం? మా మామ హెడ్ కాన్ స్టేబుల్ తెలుసా?

న: పోలీసోడికి జడిసేరకంగాదు. ఇదిగో, అయ్యగారితో చెప్పి దాన్ని నేరిపిస్తాగాని యిష్టమేనా?

ల: ఇష్టంకాదు నీ మొదం. (మెటికలు విరుస్తుంది.)

(బిందు మాధవరావు షర్టు గుండీలు పెట్టుకుంటూ ప్రవేశం.)

బిందు: అల్లా బుసబుసలాడే ఆడదాన్ని ఏమిట్రా చేయడం.

న: ఆడదంటే తాసుపాములాంటిదండి. ముందు బుసబుసలాడినా నాగస్వరం రుచిజూపిస్తే ఎట్లా ఆడమంటే అట్లా ఆడుద్దంది.

బిందు: ఏ పాముకే నాగస్వరంబడితే కట్టుబడిపోతుందో తెలుసుకోడం కష్టం రా.

న: డబ్బూ డాబుసరీవుంటే యింకే నాగస్వరమూ అక్కర్లేదండి.

బిందు: డబ్బుకీ డాబుసరికీ ఏ ఆడది వస్తుందిరా, ప్రేమించి రావాలిగాని?

న: ప్రేమేంటయ్యగారు? డబ్బుకీ డాబుసరికీ కక్కుర్తి బడితే సానిదంటారండి. ఆ కక్కుర్తిపడే ముందు (ఆడ గొంతుకతో) వారిని నేను ప్రేమించానంటే కాస్త మర్యాదగా వుంటుందండి! కక్కుర్తి కక్కుర్తేనండి.

బిందు: అయితే యీ వీధివెంట యింత ఆనందంగా విహరించే జంటలంతా యిట్లాంటి వాళ్లేనంటావుట్రా?

న: సగంమంది అంతేనండి.

బిందు: మిగతాసగం?

న: మిగతాసగం? వండింతరవాత తిండం మాన్తామాండి? అట్లాగే కట్టుకున్న తరవాత ఏరే గతిలేక తప్పనిసరిగా తిరిగే రకమండి.

బిందు: కట్టుకుంటే వెంటేసుకు తిరగాలనుంది[ట్రా? నేను తిరుగుతున్నానా?

న: అయ్యగారికింకా అనుభవం తక్కువండి. ఉంటే అమ్మగార్ని ఎనకేసు తిరుగుతూనే ఆమె సాటునే బాగోత మాడేవారండి.

బిందు: ఛీ వెధవా! నీ నోటికి హద్దూ పద్దూ లేదురా?

న: తప్పుమాటంటే మన్నించండయ్యా. తమరు సను విచ్చి మాట్లాడితే నేను మనసిచ్చి మాట్లాడేనండి. ష్త్రైవరుగా ఉంటే ష్త్రైవరుగానే వుంటానండి.

బిందు: ఫరవాలేదు గాని; ఇక్కడ ప్రతీదీ రాణివాసం స్త్రీలాగే వుంటుందే-ఎక్కడివిరా వీళ్ళకీ చీరలూ నగలూ?

న: అయ్యగారు శ్యామలమ్మగారికి కొన్నన్ని చీరలూ నగలూ అమ్మగారికి కొన్నారండి?

బిందు: (తట్టుకుని) అయితే మన ఆఫీసులో పనిచేసే స్వర్ణమాల కూడా యిట్లా తిరగదేం?

న: అది కళావంతుల పిల్లండి.

బిందు: ఏమిటీ?

న; అందుకని బయటికి రాదండి.

బిందు: అంటే?

న: ఈ కాలంలో కొంతమంది సంసారి పిల్లలు తిరిగి నట్లుగా సానోళ్ళు తిరగడం లేదండి. శ్యామలమ్మకీ స్వర్ణ మాలకీ అదేనండి భేదం.

బిందు: పోనీ, బ్రతికించావు.

న: ఏమండి అయ్యగారి నూపు అటుమళ్ళింది.

బిందు: మళ్ళదురా మరి, అంత మహారాణీలాగా కన బడుతుంటే.

న: ఏ మారాజో పున్నెంగట్టుకునుంటాడండి. అందుకని కులం తక్కువ కులమయినా గుణం రాణీ గుణం వచ్చిందండి.

బిందు: కులానికీ గుణానికీ సంబంధం లేదంటావు?

న: లేకేం జేస్తుందండి. ఆ పని గావాలంటే డాక్టరు గారిలాంటాళ్ళో శ్యామలమ్మలాటోళ్ళో పూనుకోవాలండి.

బిందు: మధూ అంటే స్వర్ణమాలకు చాలా యిష్ట మల్లే వుంది.

న: అది రైటేగానండి, ఆయన కాయమ్మమీద ఆ మోజున్నట్లు లేదంది. తనకక్కర్లేనిదాన్ని మీాగ్గూరిస్తే ఏం బోయిందండి? అయ్యగారివల్ల ఎంత మేలుబొందేడండి ఆయన.

బిందు: అయినా, మధూనల్లా అడగ్గూడదురా. ఏమయినా అనుకుంటాడు. తప్పితే శ్యామలమ్మన్నా వేమిటి?

న: ఆ స్వర్ణమాలా కాస్త ఎనకా ముందూ జూసి పోయేరకమండి. అందుకని మాలాంటోళ్ళకంటె శ్యామలమ్మ లాంటోళ్ళైళ్ళి రాయబారం నడిపితే పని జరగొచ్చండి.

బిందు: శ్యామల తన కడుపుమీాద తనే కొట్టు కుంటుందిరా?

న: ఆ యమ్మ సంగతి అయ్యగారింకా కనిపెట్టలేదండి. ఆమెకు గావలసింది డబ్బూబదసకమూానండి. అయ్యేట్లా వచ్చినా సరేనండి.

బిందు: (నిర్ఘాంతపోయి) ఆరి నీ దురంతం కాలా!

న: అట్లాంటి వకం ఈ వూళ్ళో శానా మంది వున్నా రండి. సెపితే తమరిలాంటోళ్ళు నమ్మరండి. ఆలోచిస్తే శ్యామలమ్మ కంటే ఈ పనికి డాక్టరుగారే సరయిన వాళ్లండి.

బిందు: శ్యామలయితే ఒక నెక్లేస్ కొనిపెడితే సరి పోతుంది. మధూ నడిగితే మొఖం వాచేటట్లు చివాట్లు పెడతాడే.

న: అదేంటయ్యగారు! అదంతా మీారడిగే పద్ధతిలో వుంటుందండి. మీారు చేసిన మేలుకు ఆ మాత్రం జెయ్యకపోతే స్నేహితుణ్ణని చెప్పుకోడం దేనికండి!

బిందు: స్నేహితుడిట్లాంటి వాటికత్రా ?

న: తక్కినవాటికి ఎవడయినా పనికొస్తాడండి. గోప్య మయిన యవరాలకే స్నేహితుడుగావాలండి. ఆయనలాంటోళ్లు అదీ యిదీ మాట్లాడి నచ్చజెప్పకపోతే అదొట్టి కరోడా రక మండి. ఇదివరకిద్దరు ముగ్గురు ట్రైచేసి దెబ్బదిన్నారు కూడా నండి. అందుకని అయ్యగారు యిద్దర్నీ పురికొల్పండి. ఏ రాయి తగిల్నా పండు రాలుతుందండి.

బిందు: నేను దాన్ని కేవలం కామంతో కోరడంలేదురా. నాకే స్వర్ణమాల లభిస్తే తర్వాత స్త్రీ ప్రపంచంతోనే నాకు నిమిత్తం వుండదు. నా ఆస్తిపోయినా, మర్యాదపోయినా, ఆఖరికి దాన్ని పెళ్ళిచేసుకోవలసి వచ్చినా నాకు మాల లభించి తీరాలి.

న: పెళ్లిదాకా నచ్చింతరవాత సిగ్గుపడడం దేనికండి! పెళ్లి చేసుకుంటాను మాట్లాడమని గట్టిగా చెప్పండి.(లోపలకు

చూచి) నేను బండికాడుంటానండి. (నమస్కరించి వెళ్తాడు. శ్యామల ప్రవేశం.)

శ్యా: ఏమిటిబాబూ అట్లా వున్నారు? అముదం పుచ్చుకున్నారా? వికారంగా వుందా?

బిందు: వికారంగానే వుంది.

శ్యా: ఏం వికారమండోయ్?

బిందు: శ్యామలా! నీకు నామీద విపరీతమయిన అపేక్ష అనే నమ్మకంతో అడుగుతున్నాను. నువ్వు నాకోసం ఏదయినా త్యాగం చెయ్యగలవూ?

శ్యా: ఏ త్యాగమూ చేయలేనివారు స్నేహితులమని చెప్పుకోడం దేనికి?

బిందు: నీకు కష్టమూ నష్టమూ కలిగించే పని అయినా చేయగలవా?

శ్యా: కష్టనష్టాలు లేని పని చేయడంలో త్యాగమేముంది?

బిందు: నా మనస్సు స్వర్ణమాలమీద లగ్నమయింది.

శ్యా: అయితే నన్ను మూర్తం పెట్టమంటారా?(నవ్వు.)

బిందు: అల్లరికిది సమయం కాదు.

శ్యా: అదే మీతో వచ్చిన చిక్కు. ప్రపంచంలో ఏదీకూడా సీరియస్‌గా తీసుకోగూడదు. ఏమిటో చెప్పండి చూద్దాం.

బిందు:నువ్వు స్వర్ణమాలదగ్గరకు వెళ్లి మీ ప్రొప్రయిటరుగారు నిన్ను విపరీతంగా ప్రేమిస్తున్నారు, నీ ప్రేమకోసం

సర్వస్వం త్యాగంచేయడానికి సిద్ధంగా వున్నారు అని రాయ బారం నడపగలవూ?

శ్యా: చాలా కష్టమయిన పనేనే?

బిందు: అందుకే నిన్ను నియోగిస్తున్నాను.

శ్యా: పోనీండి ఆ మాత్రం కాన్ఫిడెన్సు అయినా వున్నందుకు.

బిందు: కోపగించుకోకు మరి.

శ్యా: నాకు కోపం కూడానా?...ఆ స్వర్ణమాల డబ్బుకు లొంగేమనిషి కాదండీ! సంఘంలో గౌరవం కావాలని పేకుస్తోంది. మీకు భార్య వుండగా ఆమె లభించడం కష్ట మేమో!

బిందు: పాపం, ఆవిడేం జేసింది?

శ్యా: ఆమె మీ భార్యగా జీవించి వుండడమే మరొక స్త్రీ మిమ్మల్ని ప్రేమించడానికి పెద్ద ఆటంకం.

బిందు: భార్య వున్నవాళ్ళను ప్రేమించినవాళ్ళే లేరా?

శ్యా: ఉంటారు నావంటి అమాయకులు. కాని స్వర్ణ మాల అలాంటిది కాదు. ఆ రకం ఆడదానికి ప్రేమించడం మీదకంటె పెళ్లిచేసుకోడం మీదనే ఎక్కువ మోజు.

బిందు: పోనీ, పెళ్ళే చేసుకుంటాను.

శ్యా: అబ్బ! మీరు చేసుకుంటామంటే మటుకు ఎదటి వాళ్లు సరేననొద్దూ? మీకు భార్యవుండడమే చాలనట్లుగా స్వర్ణమాలకు మధూమీద ప్రేమకూడా ఏర్పడినట్లుంది.

బిందు: ఆ సంగతి నీకెట్లా తెలుసును?

శ్యా: ఆడదాని మనస్సు ఆడది క్షణంలో కనిపెట్టేస్తుంది.

బిందు: మరి మగవాడి మనస్సుకూడా కనిపెడుతుందా?

శ్యా: ఆహా!

బిందు: మధూ కూడా మాలను ప్రేమిస్తున్నా డంటావా?

శ్యా: ఆ సంగతి చెప్పడం చాలా కష్టం. మధూ తన ప్రేమను మనస్సులోనే వుంచుకోగల సమర్థుడు. అతనుకూడా తను స్వర్ణమాలను ప్రేమిస్తున్నానని తనకే తెలియని స్థితిలో వున్నాడనుకుంటాను.

బిందు: అయితే, అది పెద్ద ఆటంకమే.

శ్యా: ఆడది తలుచుకుంటే అన్ని ఆటంకాలూ హూత మారి పోతాయ్. ప్రయత్నం చెయ్యకుండానే నీళ్ళుగారి పోతారేమిటి?

బిందు: ఏం చెయ్యమంటావో చెప్పు.

శ్యా: ఆమెను సాధించడానికి సర్వసంసిద్ధులేగదా?

బిందు: సర్వనాశమైనా సరే ఆమె లభిస్తే చాలు.

శ్యా: అదంతా నాకు వదలండీ.

బిందు: నీకన్నా నాకు స్నేహితులెవరు?

శ్యా: పొగడ్తలకేమీ తక్కువలేదు.(అతని బుగ్గమీద కొడుతుంది.)

(తెర)

# 7

(తాంబరంలో వున్న యిల్లు, పూజా గృహంలో సుశీల భాగవతం చదువుతూ వుంటుంది.)

సుశీల: "అమ్మలగన్న యమ్మ ముగురమ్మల వేలు పుటమ్మ మేటి పెద్దమ్మ దయాంబురాసివి గదమ్మ హారింబతి సేయుమమ్మ."

శ్యా: (ప్రవేశించి) నమస్కారమండీ! క్షమించండి, పురాణ కాలక్షేపానికి ఆటంకం కలిగించినందుకు – జ్ఞాపకం వుందనుకుంటాను.

సుశీల: (పుస్తకంమూసి) లేకేం? చాలా దూరం వచ్చారు పాపం, కూర్చోండి.

శ్యా: (కూర్చుని) ఏమీ లేదండీ, చాలా రోజులుగా మిమ్మల్ని చూసిపోదామని అనుకుంటూ వుంటే ఈ దిక్కు మాలిన పబ్లిక్ వర్కుతో ఎక్కడా తీరుబడి కావడం లేదు. ఇవ్వాళ ఆ శానిటోరియంలో ఏదో పనివుంటేను అక్కడకు వెళ్లి యిక్కడకు వచ్చేను.

సుశీల: నామీద మీకింత దయారసం వుందని అనుకో లేదే. ఇందుకు చాలా కృతజ్ఞురాలను.

శ్యా: ఎంత మాటన్నారండీ! నా జీవితమే స్త్రీజన సేవకు అంకితమైపోయింది. ఏ స్త్రీకి ఏ కష్టంవచ్చినా నాకు వచ్చినట్లుగానే బాధపడతాను. మీవారితో పరిచయం అధికమైన కొద్దీ అటువంటిబాధ అధికమైంది నాకు.

సుశీల: మీకూ అల్లాంటి బాధే కలిగిందీ? మీ పరిచయానికి ఎవరాటంకం కలిగించారు?

శ్యా: ఇంకొకరాటంకం కలిగిస్తే నేనేమీ బాధపడను. నాగరిక ప్రపంచంలో స్త్రీ పురుషులు చాలా చనువుగా వుంటారు. అల్లా వున్నప్పుడే పురుషుల హృదయాన్ని స్త్రీలు బాగా అర్థం చేసుకోగలుగుతారు!

సుశీల: ఇప్పుడు మా వారి హృదయం బాగా అర్థం చేసుకున్నారా?

శ్యా: చాలా బాగా అర్థం చేసుకున్నాను. చేసుకున్న కొద్దీ మీరంటే నాకు సానుభూతి అధికమైంది.

సుశీల: తమాషాగా వుందే.

శ్యా: ఇందులో తమాషా ఏమీ లేదు. స్త్రీ జాతి తరతరాలుగా తనను క్రుంగదీసే పారతంత్ర్యభారాన్ని తొలగించుకుని, పురుషుల్తో సమానత్వాన్నీ, స్వాతంత్ర్యాన్నీ, స్వయంవికాసాన్నీ అనుభవించే ఈ రోజుల్లో మీ వంటి పెద్ద యింటిపడుచు, ఒక జమీందారుగారి కూతురు, భారత భాగవతాలు చదివి అర్థం చేసుకోగల విదుషి, ప్రేమలేని భర్త నిర్లక్ష్యంతో హింసిస్తావుంటే, విచారంతో క్రుంగి కృశించి పోవడం స్త్రీజనోద్యమానికే అవమానం.

సుశీల: అబ్బ! నిజంగా మహాసభల్లో యివ్వదగ్గ ఉప

న్యాసమే కాని, నా భర్త నన్ను నిర్లక్ష్యం చేస్తున్నారని మీ కెల్లా తెల్సింది?

శ్యా: ఇల్లా భర్త కుళ్లు కప్పిపెట్టే, భారతస్త్రీ ఈ అధోగతికి పాలైంది. మీ భర్త పట్నంలో కూర్చుని ఏం చేస్తున్నారో తెలుసా?

సుశీల: నాకెట్లా తెలుస్తుంది? అక్కడవుండే మీకు తెలియాలి.

శ్యా: తెలియబట్టే చెబుతున్నాను. ఆత్మగౌరవం గల ఏ స్త్రీ సహించరానిదిగా వుంది ఆయన ప్రవర్తన.

సుశీల: నా కాత్మగౌరవం లేదేమో.

శ్యా: లేకేం? ప్రతి స్త్రీకీ ఆత్మవుంది. అందుచేత ఆత్మగౌరవం వుండాలి.

సుశీల: నా కాత్మలేదేమో! ఉన్నా ఏం చేయమంటారు?

శ్యా: చెప్పనా? పూర్వ సాంప్రదాయాల్లో పెరిగిన మీకు కాస్త కష్టంగా వుండవచ్చును నా సలహా.

సుశీల: నా కింతకన్నా కష్టమేముంది లెండి.

శ్యా: హాయిగా ఆయనతో విడాకులు పుచ్చుకోండి.

సుశీల: విడాకులా? అవి ఎల్లా పుచ్చుకోవడం?

శ్యా: ఎంత అమాయకంగా అడుగుతారండీ? నా భర్త నన్ను హింసిస్తున్నాడని వ్యాజ్యం వేసి పుచ్చుకోండి.

సుశీల: పుచ్చుకుని ఏం జెయ్యమంటారు?

శ్యా: మరొకర్ని వివాహం చేసుకుని సుఖించండి.

సుశీల: (వచ్చేకోపం అణుచుకుని) ఆ వచ్చే ఆయనా అల్లాగే చేస్తే?

శ్యా: అందరూ అల్లాగే చేస్తారుటండీ? మగవాళ్ళల్లో మట్టుకు మంచివాళ్ళుండరేమిటి?

సుశీల: మంచివాళ్లు గదా అని చేసుకున్న తరవాత చెడ్డవాళ్లుగా పరిణమిస్తే?

శ్యా: ప్రేమించి చేసుకుంటే అల్లా జరగదు.

సుశీల: ఓహో! మీరింత తెలిసినవారు, ఎవర్నయినా ప్రేమించి వివాహం చేసుకున్నారా?

శ్యా: లేదండీ! కాస్త స్థితిగతులున్నవాళ్లు ఎవళ్లూ కనబడ్డం లేదు.

సుశీల: ప్రేమవుంటే డబ్బెందుకూ ?

శ్యా: ధనమూలమిదం జగత్తన్నారు. ఆర్థిక స్వాతంత్ర్యం లేకనేగా మన స్త్రీ జాతి అగచాట్లన్నీ?

సుశీల: నాకు ధనలోపమేమీ లేదే మరి.

శ్యా: (మౌనము, ఖంగారు.)

సుశీల: మరి నేను ఆయన్ని తప్ప మరొకర్ని ప్రేమించలేననుకోండి. అప్పుడో?

శ్యా: అప్పుడయినా "నువ్వు నన్ను వదిలిపెడితే నేనూ నిన్ను వదలగల"నని మొఖానగొట్టి చెప్పవచ్చునుగా? మీవారు మరొక స్త్రీని వివాహమాడి సుఖపడవచ్చునుగా?

సుశీల: ఆ రోంష్ోనూట నచ్చింది నాకు. మీరు చాలా దూరాలోచన కలవారండీ! ఎల్లా అయినా చదువు కున్నవాళ్లు చదువుకున్నవాళ్ళే. ఒక్క-క్షణంలో వస్తానుండండి. (లోపలికి వెళ్తుంది.)

శ్యా: (తల పంకిస్తూ వుంటుంది.)

సుశీల: (ప్రవేశించి, రెండు అరటిపళ్లు తమలపాకులు శ్యామలచేతుల్లో వుంచి) మీ విడాకుల ఉద్యమానికి ఈ స్త్రీతో ప్రయోజనం లేదు. నా సంగతేదో పెద్దలు చెప్పిన విధంగా నేను తేల్చుకుంటాను. ఇంటికి నచ్చిన స్త్రీని వూరికే పంపడం మా సాంప్రదాయం కాదు. ఇవి తీసుకుని, మల్లీ యిటువంటి ఉద్యమాలకోసం మా యింటి వేపుకు రాబోకండి. దయచేయండి.

శ్యా: (ఖంగారుగా) అపార్థం చేసుకున్నారు.

సుశీల: చాలా బాగా అర్థంచేసుకున్నాను. వెళ్లండి.

శ్యా: (అరటిపళ్లూ తమలపాకులూ పారేసి గబగబా వెళ్లిపోతుంది.)

సుశీల: (కూలబడి) చివరకు యిటువంటి వాళ్లు సలహా యిచ్చేదాకా వచ్చిందా నా గతి! (తల చేతుల్లో పెట్టుకుని ఆలోచిస్తుండగా మధు ప్రవేశం.)

మధు: ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?

సుశీల: మధూ! నేను విడాకులు పుచ్చుకోనా?

మధు: విడాకులా? నువ్వా?

సుశీల: ఏం, విడాకులంటే నీ కిష్టంలేదా?

మధు: ఇష్టంలేదనికాదు. విడాకులవల్ల నీకేం ప్రయోజనం?

సుశీల: ఎందుకు లేదు?

మధు: స్త్రీ తను ప్రేమించని భర్తను విడిచిపెట్టి, ప్రేమించిన పురుషుణ్ణి వివాహం చేసుకుంటానికి విడాకులు ఉపయోగపడవచ్చును. నీ బాధంతా నీవు గింకూను విపరీతంగా ప్రేమించి, అతని ప్రేమను పొందలేక పోవడంవల్ల. నువ్వు కోరేది బిందూని.

సుశీల: నేను వారిని సుఖపెట్టలేకపోయినాను. వారైనా వారు ప్రేమించిన స్త్రీని వివాహం చేసుకుని సుఖపడతారేమోగా, నేను విడాకులు పుచ్చుకుంటే?

మధు: ఎంతకాదన్నా బిందూ సహృదయుడు. నువ్వు బ్రతికివుండగా మరొక భార్యతో అతను సుఖించలేడు.

సుశీల: ఇప్పుడు సుఖించలేదా?

మధు: అతను నిజంగా సుఖిస్తున్నాడని నేననుకోను. కొద్దికాలంలోనే అతనికా జీవితంమీద అసహ్యం కలుగుతుంది.

సుశీల: కలిగినా నాకేం ప్రయోజనం? పోనీ- నేను పుట్టింటికి వెళ్లిపోతే?

మధు: వెళ్లి చేసేది?

సుశీల: ఉండి చేసేది?

మధు: సత్యాగ్రహం. ప్రేమ నిశ్చలమూ నిర్హేతుకమూ అయినప్పుడు ఎదటివారిలో ప్రేమను కలిగించి తీరుతుంది. నీ విప్పుడు వెళ్లిపోతే ఓంచూ అధోగతిపాలయి పోతాడు.

సుశీల: ఏమో మధూ! నీ మాటలు విశ్వసించి జీవయాత్ర సాగిస్తున్నాను.

మధు: సాగించు, యాత్రాంతంలో ప్రేమదేవత సాక్షాత్కరించి తీరుతుంది.

(తెర)

# 8

(బిందు మాధవరావు బంగళా. బిందు సిగరెట్ మీద సిగరెట్ త్రాగుతూ పచారు చేస్తూ వుంటాడు. ప్రక్కన నటేశం చేతులు కట్టుకుని నిలబడి వుంటాడు.)

బిందు: కో–అంటే కోటిమంది ఆడవాళ్లున్నారు. ఎందుకురా ఆ నూతలమీద మా కింత వెర్రి?

నటేశం: అయ్యగారి కాయమ్మమీద మోజు. ఆమేదో దేవతో అప్సరసో అని కాదండి.

బిందు: ఎందుకురా మరో మనుష్యుల మనస్తత్వం మా కన్నా నీకే ఎక్కువ తెలిసేటట్లుంది?

న: పదిమంది క్రింద పనిచేసే వాడికి తెలియకుండా యెట్లా వుంటుందండి?

బిందు: అందర్నీ వదిలిపెట్టి మా మనస్సు దేనికిరా ఆ మాలమీదకు పోతున్నది?

న: అమ్మాయి తేలిగ్గా రాదని తెలిసింది.

బిందు: కాదురా!

న: కాదంటే నేనేం చెయ్యానండి?

బిందు: దాని మనస్సు ఎల్లా వుందో కనుక్కో లేవు(టా?

న: ఆ యమ్మ నా అంతస్థుకు పై మనిషండి. ఆలోచిస్తే ఆమెచేత సరే ననిపించడం శ్యామలమ్మ చేతకూడా అయ్యేటట్లు లేదండి.

బిందు: మరెవరివల్ల నవుతుందిరా?

న: అందుకు డాక్టరుగారేనండి!

బిందు: ఛీ! మధూని ఎల్లారా అడగడం?

న: అడక్కపోతే అల్లా సిగరెట్లు కాలుస్తూ తిరుగుతూ వుంటమేనండి.

బిందు: అట్లా ఉండగలిగినా బాగుండును. అదీ చేత కావడంలేదు.

న: ఇంతకీ అయ్యగారు డాక్టరుగార్ని అడక్కుండానే మీనం మేషం లెక్కెడుతుండారండి. అడిగిచూస్తే సరేనంటే మంచిదేనండి. కాదంటే యింతకన్నా చెడిపోయేదేముందండి? ఇట్టావుంటే మతికూడా చెడిపోతుందండి.

బిందు: నిజమే(రా! నిజంగా మతే చెడిపోయేటట్లుంది. ఈ అవస్థలోనుంచి తప్పించలేని స్నేహితుడుండెందుకు లేకుండుకు? పోనీ తనయినా (పేమిస్తున్నాడా అంటే అదీలేదు.

న: అదేనండి నేననేది. (బయటకు చూచి) ఆయనే యిట్టా వస్తున్నారండి, ఎందుకో? మనసు రాయి జేసుకుని అడిగెయ్యండి. నేను బండికాడుంటానండి. (వెళ్ళిపోతాడు.)

(బిందూ సిగరెట్ కాలుస్తూ పరధ్యాన్నంగా వున్నట్లుండగా మధు (పవేశం. చాలా విచారంగా వుంటాడు.)

మధు: ఏం బిందూ, అల్లా వున్నావు? రోజుకిన్ని సిగ రెట్లు కాలుస్తుంటే ఊపిరితిత్తులేమవుతయ్?

బిందు: ముందు హృదయం సంగతి తేల్చు. తరవాత వూపిరితిత్తుల సంగతి చూచుకోవచ్చు.

మధు: హృదయం సంగతేమిటి? (జేబులోనుంచి స్టెతోస్కోప్ తీస్తాడు.)

బిందు: నా బాధ వాటితో కనిపెట్టేదికాదు మధూ! నేను బ్రతికి ప్రయోజనం కనబడ్డం లేదు.

మధు: సుశీలా అల్లాగే అనుకుంటోంది.

బిందు: సుశీల! సుశీల!! సుశీల!!! ఈ సుశీల గొడవతోనే నా జీవితమంతా వెళ్ళిపోయేటట్లుంది.

మధు: పోనీలే బిందూ! ఎవరి ప్రమేయమూ లేకుండా నువ్వు ఏ విధంగా సుఖపడగలిగితే ఆ విధంగా సుఖపడు.

బిందు: ఆవిడ బ్రతికివుండగా ఏ విధంగానూ సుఖపడ డానికి వీలులేదల్లేవుంది. ఇంతకీ యీ అవస్థ అంతా నాకు నువ్వే తెచ్చిపెట్టేవు. ఆ పల్లెటూళ్ళో పడివున్నప్పుడు ఏ బాధా లేదు నాకు.

మధు: (విచారంగా) నీకు నేనేం బాధ కలిగించాను బిందూ?

బిందు: నా జీవితంలోకి స్వర్ణమాలను నువ్వే ప్రవేశ పెట్టేవు. ఆమె నా హృదయాన్ని హరించేసింది. ఆమెను పొందడమో, ఆత్మహత్య చేసుకుచావడమో తప్ప నాకు మార్గాంతరం లేదు మధూ!

మధు: (నిర్విణ్ణుడై పోతాడు.)

బిందు: ఏం మాట్లాడవేం...నాకు తెలుసు!

మధు: ఏం తెలుసు?

బిందు: స్వర్ణమాలను నువ్వెప్పుడూ విడిచిపెట్టవని!

మధు: బిందూ! స్వర్ణమాల ఆత్మగౌరవమూ సంస్కారమూ మూర్తీభవించిన విదుషి. కావాలంటే నీకు అందగత్తెలు అనేకమంది దొరుకుతారు. మాల జోలికిమాత్రం పోకు.

బిందు: పోతే నీకంత కష్టమా?

మధు; నాకేమీ కష్టంలేదు. ఆశాభంగంతో నువ్వు మరీ బాధపడతావేమోనని భయం, అంతే!

బిందు: అంతేనా? నిజం చెప్పు మధూ! నీ కిందువల్ల ఏమీ కష్టంలేదూ?

మధు: స్వర్ణమాల హృదయంమీద సర్వాధికారాలూ ఆమెవే. ఆమె తన ప్రేమను ఎవరికిచ్చుకున్నా నాకేమీ అభ్యంతరం లేదు.

బిందు: నేను స్వర్ణమాలను మనఃపూర్వకంగా త్రికరణ శుద్ధిగా ప్రేమిస్తున్నాను. ఈ శరీరంలో ప్రతి జీవాణువూ ఆమె భావనలో దహించుకుపోతున్నది. ఏం జెయ్యను?

మధు: నేనేం జెయ్యను?

బిందు: నువ్వంటే మాలకు భక్తి విశ్వాసాలు. నీ మాట ఆమెకు వేదవాక్యం! నీవే ఆమెను ప్రేమించని పక్షంలో ఆమె నాదయ్యేటట్లు చూడవూ?

మధు: ఆమెకూ నాకూ మధ్య వొకే ఒక సంబంధం

వుంది. అది కళకు సంబంధించింది. నేను నిన్ను నిరుత్సాహ పరచడం స్వార్థంవల్ల కాదు. బిందూ! నువ్వు కళాపోషకుడివి. మాల నీ ఆశ్రయంపొందిన కళాసేవకి.ఆమెను నువ్విలా కోరడం భావ్యంకాదు. అందుకు రాయబారం నన్ను చేయమనడం అంతకన్నా భావ్యం కాదు.

బిందు: ఎవరో ఒకరు రాయబారం చేయకుండా ఇద్దరు వ్యక్తులు ఎల్లా సంబంధం ఏర్పరచుకోడం?

మధు: ఋణానుబంధంవల్ల; పరస్పరాకర్షణవల్ల.

బిందు: ఆ రెండూ లేకనే నిన్ను కోరుతున్నాను.

మధు: అప్పుడెవర్నీ కోరకూడదు.

బిందు: మాల విషయంలో నా సంకల్పం పవిత్రమైంది. నేనామెను వివాహం చేసుకుంటానికి కూడా సిద్ధంగా వున్నాను.

మధు: (తల పంకించి) బిందూ! సుశీల నీకు కేవలం భార్యనై వుంటే చాలునని - అందరు దేవతల్నీ ప్రార్థిస్తోంది. ఆమె ప్రేమను అనుభవించలేకపోతే పోనీ, అగౌరవం మాత్రం చేయకు.

బిందు: మధూ! నే నీజన్మలో సుశీలతో సుఖపడలేను. ఆ సంగతి నీకు తెలియనిది కాదు. ఆమె ప్రేమఋణం మరొక జన్మలో తీర్చుకుంటాను. మధూ!...

మధు: ఎంత విషమపరీక్ష! బిందూ! మాల తన హృదయాన్ని మరొకరికి సమర్పించుకుంది. ఆమె హృదయంలో యింకెవరికీ స్థానంలేదు.

బిందు: ఆమెతో నీకే సంబంధమూలేదని అబద్ధాలాడ

తావేం? మాల నిన్నే ప్రేమిస్తున్నది. నువ్వు మాలను ప్రేమిస్తున్నావు. కనకనే యీ ధర్మోపన్యాసం.

మధు: ఎందుకా అనుమానం? నేను కళాసేవకుణ్ణి. కళాసేవకులతో ఏ విధమైన వ్యక్తిగత సంబంధమూ పెట్టుకోను. అది నిశ్చయం.

బిందు: అయితే నా హృదయావేదన ఆమె కెందుకు తెలియజేయవు మధూ? నీవు చెబితే ఆమె మనస్సు మార్చుకుంటుంది. నా సర్వస్వమూ ఆమెకు ధారబోయడానికి సిద్ధంగా వున్నానే!

మధు: ఆమె యింకొకర్ని ప్రేమిస్తున్నదని చెప్పేను. ధనానికి శరీరమమ్ముకునే నీచురాలు కాదు మాల!

బిందు: (హేళనగా) ఆమె యింటావంటా అటువంటి వేమీ లేవు పాపం.

మధు: తను గౌరవించలేని స్త్రీని పురుషుడెప్పుడూ ప్రేమించలేడు. ఆమె కళావంతుల యింట్లో పుట్టిందనేగా ఆమె ప్రేమను బేరమాడమని నన్ను నియోగిస్తున్నావ్? బిందూ! ఇది నవయుగం. ఇందులో వంశానికీ ప్రవర్తనకూ ఏమీ సంబంధం లేదు. అది వారి సంస్కారాన్నిబట్టి వుంటుంది.

బిందు: చాల్లేవోయ్! దానికున్న సంస్కారం మాకెల్లా వుంటుంది? మధూ! నిన్ను ప్రాణంలో ప్రాణంగా ప్రేమించాను. నీకున్న సర్వస్వమూ నేనిచ్చిందే. నీ కవసరంలేనిదాన్ని నాకు సమకూర్చడానికి ప్రయత్నమైనా చేయలేని కృతఘ్నుడ వనుకోలేదు.

మధు: బిందూ! మోహావేశంలో నీ ఔదార్యం

మృగ్యమైపోయింది. నువ్వు నాకు చేసిన మేలుకు నా ప్రాణాలు బలియివ్వమన్నా యిస్తాను. కాని యిదెక్కడి కృతజ్ఞత? కృతజ్ఞత పేరుతో తార్చడం నాచేత కాదు.

ఒక విధంగా యీ విషమపరిస్థితికి నేనే కారణం. నీవా పల్లెటూళ్ళోనే వుండి వుంటే యీ స్థితికి వచ్చేవాడివే కాదేమో?

బిందూ! జమీందారీలు పనికిరావనే జమీందారువు. అడిగినంతమాత్రాన లక్షరూపాయలు ఖర్చుపెట్టి ధర్మవైద్యశాల స్థాపించిన ధార్మికుడివి. నటననికేతనం స్థాపించి ప్రముఖులందరిచేతా మన్ననలు పొందిన కళాపోషకుడివి. దరిద్రుణ్ణయిన నన్నింతవాణ్ణి చేసిన ప్రాణస్నేహితుడివి. నీ కెందుకీ దుర్బుద్ధి? ఇది తప్ప యింకేమయినా అడుగు, నా ప్రాణాలర్పించి అయినా నీ సేవచేసుకుంటాను.

బిందు: ఇది దుర్బుద్ధి కాదు, నా హృదయాన్ని కాల్చివేసే ప్రేమాగ్ని.

మధు: నిజమేనేమో! నువ్వామెను నిజంగానే ప్రేమిస్తున్నావేమో! నిజంగానే ప్రేమిస్తే ప్రేమించిన హృదయం ప్రేమితవస్తువు లభించనప్పుడు ఎంత ఆవేదన పడుతుందో, ఎంత చిత్రవధ పడుతుందో నీకు బోధపడుతుంది.

ప్రేమ ఒకరి రాయబారాలతో ఏర్పడేదికాదు బిందూ! ఉత్తమంస్వార్జితం విత్తం. ఉత్తమా స్వార్జితానారీ! నువ్వే వెళ్ళి మాలను కలుసుకో! నీ హృదయావేదనను వెళ్ళబోసుకో! ప్రేమ కలిగించే వినయంతో ప్రేమభిక్ష పెట్టమని యాచించుకో!

ఆమె మనస్సు కరిగి, తిరిగి, నిన్ను ప్రేమించగలిగితే పెళ్ళి చేసుకో. ప్రమాణపూర్వకంగా చెబుతున్నాను. నేనేమీ అనుకోను. ప్రాణంపోయినా నేను మాత్రం మాల నీపని చేయమని చెప్పను. వెళ్తున్నాను. (వెళ్లిపోతాడు.)

బిందు: (మధు పోయిన దిక్కే చూస్తూ వుండగా శ్యామల ప్రవేశం.)

శ్యా: అల్లా చూస్తున్నావేమిటి? మధు తనలో తను గొణుక్కుంటూ పోతున్నాడేమిటి?

బిందు: ఆదర్శమంత్రాలు. ఎక్కణ్ణుంచి?

శ్యా: మాల యింటిదగ్గర్నుంచి.

బిందు: (ఆదుర్దాగా) ఏమిటి విశేషం?

శ్యా: విశేషమేముంటుంది? ఏదో చందాకోసం వెళ్ళినట్లుగా వెళ్ళి మీ ప్రస్తావన తెచ్చేను. ఎంతసేపూ "వివాహితుణ్ణి నేను వివాహం చేసుకోను. ఏ జన్మలోనో ఏ స్త్రీ భర్తనో అపహరించి యీ జన్మ ఎత్తేను" అంటుందేగాని దారీ తెన్నూ చూపించడం లేదు.

బిందు. అంటే నేనవివాహితుణ్ణయితే ఆమె కభ్యంతరం ఉండేది కాదన్నమాట! ఎంత చల్లనిమాట చెప్పేవు. త్యాగమంటే నీదీ త్యాగం. అంత మేలుపొందిన మధు ఆ మాత్రం చేయలేకపోయినాడు. (లోపలకువెళ్లి ఒక కవరు తెచ్చియిస్తూ) ఇదిగో చెక్కు, నీ యిష్టం వచ్చిన పద్ధతిలో బంగళా కట్టించుకో.

శ్యా: (తీసుకుని హ్యాండ్ బేగ్‌లో పెట్టుకుని) ఏమయిందేమిటి?

బిందు: ఏముందీ, నా హృదయావేదన కాస్త మాలకు తెలియజేయమని ప్రాధేయపడితే కాదన్నాడు. నేను కృతఘ్నుడవని నింది స్తే కృతజ్ఞత అంటే తార్చడం కాదని వెళ్లి పోయినాడు.

శ్యా: (ఆదుర్దాగా) మాలను ప్రేమిస్తున్నానని వొప్పు కున్నాడా?

బిందు: ఒప్పుకుంటే నేనతన్నెందుకు నిందిస్తాను? తన సంబంధం కేవలం కళా సంబంధమే నంటాడు.

శ్యా: వేదాంతాలతో జీవితం వెళ్ళదని ఉభయులూ యింకా తెలుసుకోలేదు లెండి!

బిందు: నేనే వెళ్లి మాలను కలుసుకుంటే? కేవలం తెలియనిది కాదుగా?

శ్యా: మీ అంతవారు స్వయంగా వెళ్లి నన్ను వివాహం చేసుకోమంటే కాదని కాలదన్నడానికి మాల ఏమీ తెలివి తక్కువదికాదు. వివాహం చేసుకుంటానని ఆశపెట్టండి! ఓ మాటు లొంగితే తరవాత సంగతి ఆలోచిద్దాం!

బిందు: ఆలోచించడం దేనికి? ఆ క్షణాన పెళ్లి చేసు కుంటాను. అంతకన్నానా?

శ్యా: అందుకయినా మీ ఆవిడను మీతో విడాకులు పుచ్చుకోనంటోందిగా?

బిందు: (ఆదుర్దాగా) సుశీలనుకూడా కలుసుకున్నావా?

శ్యా: కలుసుకోడమూ అయింది, చీవాట్లు తినడమూ అయింది.

బిందు: (మరీ ఆదుర్దాగా) అక్కడా యీ గొడవ తెచ్చేవా?

శ్యా: పెళ్లామంటే గడగళ్లాడే వాళ్ళకి ప్రేమకలాపా లెందుకండీ?

బిందు: గడగడలాడటం కాదు. అనవసరంగా సుశీలను కష్టపెట్టడం నా కిష్టం లేదు.

శ్యా: ఆవిణ్ణొదిలిపెట్టి యింకో అమ్మాయిని పెళ్లి చేసుకోడం మాత్రం చాలా యిష్టం.

బిందు: ఇంకో అమ్మాయి దొరికినప్పుడు ఎల్లాగూ ఆమెను కష్టపెట్టక తప్పదుగా!

శ్యా: అవసరమైతే కష్టపెట్టగలరన్నమాట!

బిందు: స్వర్గమాలకోసం ఏ పని అయినా చెయ్యగలను.

శ్యా: కాకపోతే మాలాంటి వాళ్ళకోసం చేస్తారని చెప్పడం లేదు లెండి! (కోపంగా వెళ్లిపోబోతుంది.)

బిందు: శ్యామలా! శ్యామలా! ఆగు!

(శ్యామల కులుక్కుంటూ తిరుగుతుండగా-)

(తెర)

# 9

(స్వర్ణమాల యిల్లు. మాల మల్లెపూలదండ గుచ్చుతూ వుంటుంది. గోపాల్ ఏదో పుస్తకం చదువుతూ వుంటాడు. నటేశం ప్రవేశం.)

న: రాజాగారు వచ్చి వుండారమ్మా!

స్వర్ణ: (ఆశ్చర్యంతో) బిందు మాధవరావుగారా! ఆయనెందుకొస్తారిక్కడికి? గోపాల్! ఆ కుర్చీ యిలా వెయ్యి! (నటేశం వెళ్తాడు. గోపాల్ కుర్చీ వేస్తూ వుండగా బిందూ ప్రవేశం.)

బిందు: స్వర్ణమాల! చేతుల్లో పువ్వుమాల! ఎంత దర్శనీయమైన దృశ్యం!

(గోపాల్ కుర్చీ ముందుకు తోస్తాడు కోపంగా.)

స్వ: (గోపాల్ వంక శాంతించమన్నట్లుగా చూచి) గోపాల్! ప్రొప్రయిటరుగారి కేమయినా ఫలహారం తెప్పించు. (గోపాల్ జాగ్రత్త అని సౌజ్ఞ చేసి వెళ్తాడు.)

స్వ: (కోపమూ గౌరవమూ ధ్వనించే రీతిగా) దయ చేయండి! ఎన్నడూ లేనిది ఏమిటి యీ గౌరవం మాకు?

బిందు: (కూర్చుని) మాలా! నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడడానికని వచ్చేను.

స్వ: అందుకింత దూరం రావాలా?

బిందు: అది ఆఫీసుకుగాని నటననికేతనానికిగాని సంబంధించిన విషయం కాదు. అది కేవలం వ్యక్తిగతమైన విషయం.

స్వ: (ఆశ్చర్యంగా) వ్యక్తిగతమైన విషయమా?

బిందు: మాలా! నిన్ను నేను ప్రేమిస్తున్నాను. ఆ సంగతే స్వయంగా చెప్పడానికి వచ్చేను.

స్వ: మీ ప్రోద్బలంవల్లనే గామల్ను శ్యామల వచ్చి చిలకపలుకులు పలికిపోయింది. ఆమెకు నా అభిప్రాయం తెలియజేశానే!

బిందు: నేనే స్వయంగా వచ్చి నా హృదయవేదన నీకు తెలియజేసుకుంటే నీ మనస్సు కరుగుతుందేమోననే ఆశతో వచ్చేను.

స్వ: (వచ్చేకోపం అణుచుకుంటూ) మీరు పెద్దలు! మాకు పోషకులు! పైగా వివాహితులు! ఇల్లా మాట్లాడడం మీ తాహతుకు తగని పని!

బిందు: మాలా! నా సంకల్పం పవిత్రమైంది. నేను నిన్ను వివాహం చేసుకుంటానికైనా సిద్ధంగా వున్నాను.

స్వ: అప్పుడూ నేను మిమ్మల్ని ప్రేమించలేను. మరొక స్త్రీ భర్తను నేనపహరించలేను.

బిందు: నా వివాహ పరిస్థితులు నీకు తెలియవు.

స్వ: తెలిసినా వివాహితులు, వివాహితులే!

బిందు: మాలా! నేను అవివాహితుణ్ణయి నీ ప్రేమా నర్థిస్తే ఏమని వుండేదానివి?

స్వ: కారుగా? (ఖంగారు పడుతుంది.)

బిందు: (లేచి ఆమెను సమీపిస్తూ) నీవు నన్ను ప్రేమించడానికి నా వివాహమేగా ఆటంకం? నా ప్రేమ నన్ను ఉన్మత్తుణ్ణి చేసింది. నేను కేవలం దీనుణ్ణి!

స్వ: (భయంగా) అయ్యో! ఏమిటిది, కూర్చోండి.

బిందు: మాలా! అనుగ్రహించు! (ఇంకా సమీపిస్తాడు.)

స్వ: అయ్యో, ఆగండి. (వెనక్కు తగ్గుతుంది. గోపాల్ ఫలహారాలతో ప్రవేశించి, బల్లమీద పెట్టి బిందూ పై పట్టుకుని-)

గో: ఎవరనుకున్నావయ్యా? ఏమో అనుకున్నాను. నువ్వింత ఘనుడివా? నీకు సత్కారం చేయవలసిన విధం వేరు. (లెంపకాయ కొట్టబోతాడు.)

స్వ: (గోపాల్ చేయిపట్టుకుని) గోపాల్! ఏమిటా తొందరపాటు! వారిని విడిచిపెట్టు. (గోపాల్ విడుస్తాడు.)

బిందు: (ధీమాగా నిలబడి) నేను మాలను ప్రేమించాను. సమీపించడం తప్పేనేమో! అయినా నా మీద చేయి చేసుకునేపాటివాడివా? నేను దెబ్బతిన్న త్రాచుపామును జాగ్రత్త! (రివరివా వెళ్ళిపోతాడు.)

స్వ: ఎందుకు గోపాల్, అల్లా చేయి చేసుకోబోవడం?

గో: నీవు నోరు చేసుకుంటే ఆగనివాడిమీద నేను చేయిచేసుకుంటే ఏమిటి తప్పు?

స్వ: తప్పుకాదూ! ఏదో దౌర్బల్యంతో అల్లా ప్రవర్తిస్తేమటుకు పెద్దా చిన్నా చూడకర్లా?

గో: దౌర్బల్యాన్ని సహించవచ్చు. దౌర్జన్యాన్నెలా సహించేది? ఇంతకీ ఏమిటీ కూ స్తున్నాడు?

స్వ: "నిన్ను ప్రేమిస్తున్నాను. వివాహం చేసుకో" అన్నాడు!

గో: ఇంకేం! జమీందారుగారు పెళ్ళి చేసుకోమనే టప్పటికి ఆత్మగౌరవం అంతరించి పోయిందన్నమాట!

స్వ: ఆత్మగౌరవానికి భంగమైన పని ఏదీ ఆయన చేయలేదు. నేను మిమ్మల్ని ప్రేమించలేనని చెబితే యేమని ఉండేవారో?

గో: మరేమని చెప్పేవు?

స్వ: నేను వివాహితుణ్ణి ప్రేమించలేనని చెప్పేను.

గో: కొంపముంచేశావు. రేపీయన పోరుబడలేక సుశీ లమ్మ ఏ అఘాయిత్యమో చేసుకుంటే, ఆయన్ను పెళ్ళి చేసుకుంటావన్నమాట!

స్వ: ఏమిటి గోపాల్! నేను గురూజీని ఎంతగా ప్రేమి స్తున్నానో నీకు తెలియదూ?

గో: మరి ఎందుకాయనతో ఆ సంగతి చెప్పలేదు?

స్వ: ఆయన కామాంధకారంలో గురూజీ కేలపకారం తలపెడతాగోనని చెప్పలేదు. అయినా హృదయాల్లోనే పుట్టి హృదయాల్లో అణగివుండవలసిన ప్రేమను గురించి నలుగురితో చెప్పుకోడం దేనికి? (నిట్టూర్పు.)

గో: అదీనిజమే! కాని నీ సమాధానం, ఆయన అవివాహితుడై వుంటేనో, మరొక స్త్రీకి భర్త కాకుండా వుంటేనో నీ వైఖరి వేరుగా వుండేదన్న భావాన్ని కలిగిస్తున్నది. ఆయనల్లా అర్థంచేసుకుంటే చాలా అనర్థకాలు సంభవించవచ్చును.

స్వ: నిజమే గోపాల్! ఆయనకు ఉత్తరం రాసి క్షమార్పణ కోరనా?

గో: ఇంకా నయం. ఇదంతా వెంటనే గురూజీకి తెలియ చెయ్యాలి! నీవు తలుపు వేసుకుని జాగ్రత్తగా వుండు. (నిష్క్రమణ.)

స్వ: పరాత్పరా! రక్షించు!

(తెర)

# 10

(బిందు బంగళాలో డ్రాయింగురూము. నటేశం అవీ యివీ సవరిస్తూ వుంటాడు. బల్లమీద శ్యామల ఫోటో—నటేశం అది తీసిచూస్తూ—)

న: కాసుకూర్చుండే ఆడది కానీగ్గూడ చెల్లదు. ఒకూర్కుబోయిన కొద్దీ ఆడదానిమీద మక్కువెక్కువౌతుంది. ఇట్టా వుంది మొగవాళ్ళ అవస్థ! (శ్యామల ప్రవేశం.)

శ్యా: ఇప్పుడేమవస్థ వచ్చింది, మొగాళ్ళకి?

న: అవస్థగాకపోతే, అయ్యగారంతవాడు పోయి, ఆ బెంబేలు నాయాలుచేత దెబ్బలు తినొస్తాడా?

శ్యా: (ఆశ్చర్యంతో)అయ్యగారు దెబ్బలుతినడమేమిటి?

న: మాలతో మాట్లాడుతూ, ఆగలేక మీదబడబోతే గోపాలొచ్చి గూబ్బద్దలు గొట్టేడు.

శ్యా: ఆఁ! అయ్యగా రూరుకున్నారా?

న: ఊరుకో కేంజేస్తారు? ఇంటికొచ్చి వేన్నీళ్ళ స్థానం జేస్తున్నారు. (ఎగాదిగా జూచి) తమరెక్కణ్ణుంచి?

శ్యా: ఇంకో పొగరుబోతు వెధవదగ్గుర్నుంచి!

న: మన ముస్తాబేం పనిజెయ్యలేదన్లే వుందే! ఎవడా పోతురాజు!

శ్యా: ఇంకెవరున్నారు? మధు!

న: ఎళ్ళకెళ్ళ కాయనదగ్గరకే మెళ్ళాలి!

శ్యా: ఏం! ఆయనేం దిగొచ్చాడా!

న: ఆయన మాలను చేతులో బెట్టుకునే, మీానం మేషం లెక్కెడుతూవుంటే నీ మొఖమేం జూస్తాడు?

శ్యా: (కోపంగా) నోరుముయ్!

న: ఈ నోరక్కడుంటే ఎంత బాగుండేది?

శ్యా: ఉండకేమయింది? మాలను రాజాగారికి కుర్చి బాగుపడమని సలహా యిస్తే అవాకులూ చెవాకులూ మాట్లాడేడు. లేనిపోనివి నెత్తినవేసుకుని ముగ్గురిచేత అవమానం పొందేను.

న: బంగళాలూ, పట్టుచీరలూ ఊరికే వస్తయ్యమ్మా మరి?

శ్యా: పరువుపోయింతరవాత బంగళా లెందుకు, పట్టుచీర లెందుకు? ఈ రోజునుంచీ నాకే ఆశయాలూ లేవు- నన్నింత తృణీకరించిన మధూనీ, మాలనూ, ఆ సుశీలనూ నాశనం చెయ్యడం తప్ప.

న: పెడితే పెళ్ళి, పెట్టకపోతే శ్రాద్ధం కానీ!

శ్యా: అట్లాగే చూస్తూవుండు. ఈ శ్యామల తడాఖా చూపిస్తాను వీళ్ళందరికీ. అయ్యగారొచ్చే వేళయింది. నువ్వు బయటకు వెళ్ళు.

న: శాస్త్ర డబ్బురాలే పద్ధతి చూడవమ్మోయ్! (వెళ్తాడు.)

బిందు: (వస్తూ) ఆడబోయిన తీర్థం ఎదురైందన్నట్లుంది. నీ కోసం కారు పంపిద్దామనుకుంటున్నాను.

శ్యా: నా కోసం కారెందుకు లెండి? స్వయంగా వెళ్ళి ప్రాధేయపడి వచ్చారు గామల్ను, ఏమంది ప్రణయేశ్వరి?

బిందు: ఇంకో స్త్రీ భర్తను అపహరించలేనంది.

శ్యా: అందీ? అంటే అర్థమేమిటో తెలిసిందా?

బిందు: ఏమిటి?

శ్యా: పోహూ పొత్తూ లేకుండా మీరు భర్తగా లభిస్తే జమీందారిణి అనిపించుకుంటానికి మొత్తబడుతుందన్న మాట!

బిందు: మరి మధు సంగతేమిటి?

శ్యా: జీవితమంటే భావకవిత్వంగాదండీ! ఇల్లూ వాకిలీ పిల్లా జల్లా కావాలని కోరుతుంది ఏ ఆడదయినా. ఎప్పటికయినా దారికొస్తాడేమోనని చూచింది. అక్కడే గోడూ కనిపించ లేదు. ఇప్పుడు మీకీ పాచిక వేసింది.

బిందు: ఏం పాచిక వేసింది?

శ్యా: ఈ మాత్రం తెలియనివాళ్ళు ఆడవాళ్ళ జోలి కెందుకూ పోవడం? మీకు భార్య వుండగా మాల మిమ్మల్ని చస్తే పెళ్ళిచేసుకోదు?

బిందు: లేని పక్షంలో?

శ్యా: అవకాశం వుంది!

బిందు: నిజమే! "నేనవివాహితుణ్ణయివుంటే ఏమని వుండేదాని"వంటే కారుగా అని ఊరుకుంది!

శ్యా: ఇంకేం? యిక మీ భార్యకు విడాకులిచ్చెయ్యండి!

బిందు: ఆవిడ్నే పుచ్చుకోమన్నావుగా.

శ్యా: ఆవిడట్లాంటి పనేదీ చేసేటట్లు లేదు. ఒకవేళ చేద్దామనుకున్నా మీ మధు చేయనివ్వడు.

బిందు: అందువల్ల మధు కేంలాభం?

శ్యా: అదంతా నాకెందుగ్గానీ, విషయం యిది. మీకు మాల దొరకాలంటే మీరు మీ భార్యతో తెగతెంపులన్నా చేసుకోవాలి. లేదా మాలకి మధు మీద ద్వేషం ఏర్పడే టట్లన్నా చేయాలి.

బిందు: రెండూ సాధ్యంకాని పనులే!

శ్యా: సాధ్యంకావనుకుంటే కాకుండానే వుంటయ్. ప్రయత్నించకుండానే నీళ్ళుగారిపోతారేమిటి?

బిందు: మరి ఎల్లా సాధ్యమవుతయ్యో నువ్వే చెప్పు.

శ్యా: ఇల్లా రండి. (అతని చెవిలో ఏవో చెబుతుంది.)

బిందు: రామరామ! మహా ఘోరం! నా వల్లకాదు.

శ్యా: అయితే ఆ వూసే మరచిపోండి.

బిందు: అదీ నావల్ల కాదు.

శ్యా: అవ్వా బువ్వా కావాలంటే యెట్లా? కోడి మాంసం తినాలనివుంటే కోణ్ణి కొయ్యక తప్పదు. అంతా అయింతరవాత అనవసరంగా అపోహ పడ్డానని ఒక్క క్షమార్పణ పారేస్తే తీరిపోతుంది.

బిందు: అప్పుడయినా మాల నన్ను వివాహం చేసుకుంటుందని యేం నమ్మకం?

శ్యా: ముందు మధు మీద ద్వేషం యేర్పడుతుంది. సుశీలమీద అసహ్యం యేర్పడి ఆమె మీద సానుభూతి పోతుంది. మీమీద సానుభూతి యేర్పడుతుంది. దేముడనుకుని ప్రేమించిన మొగవాడు మోసగించడంతోనే, కడుపు మండిన ఆడది ఏమేం జేస్తుందో ఎవరు చెప్పగలరు?

బిందు: ఇల్లా మనమనుకున్నట్టల్లా కాలేదనుకో!

శ్యా: అప్పుడు మాత్రం పోయిందేముంది? ఏమిరా పాటంటే, ఎప్పటాట. మాలేదో తన సొత్తయినట్లుగా మధూ మిమ్మల్నీ నన్నూ కూడా తృణీకరించాడు. మీకు దక్కక పోయినా అతనికయినా దక్కకుండా పోతుందిగా? అసలా సందేహ మెందుకు? ముందు మీరీపని చేయండి. మూడు వారాల్లో మాల మిమ్మల్ని పెళ్లిచేసుకోకపోతే నా తల తీయించండి.

(లక్ష్మి వచ్చి ఆ మాట విని చాటుగా నిలబడుతుంది.)

బిందు: నువ్వింతగా చెబుతున్నావు గనక నమ్ముతున్నాను. కాని సుశీల కే అపాయమూ రాకూడదు. ఆమె రాణివాసాని కెంతమాత్రమూ భంగం రాకూడదు. నేనిందుకు అంగీకరించానని సుతరామూ తెలియనివ్వగూడదు.

శ్యా: ఎంత చెడ్డా నేనూ ఆడదాన్నేనండీ. ఇక మీదట మీరు తాంబరం పోతూవుండండి! మీ మనస్సు మారినట్లుగా నటిస్తూ వుండండి. నటేశాన్ని ఆవిడ నమ్మేటట్లుగా చూడండి.

బిందు: (ఖంగారుగా) ఏదో మహా అగాధంలోకి దిగుతున్నాము.

శ్యా: ప్రేమంటే ఏమిటనుకున్నారూ? పెద్ద అగాధం! (అతని బుగ్గమీద చిటికె వేస్తుంది.)

(తెర)

# 11

(తాంబరంలో సుశీల యింట్లో గది. సుశీల నిలువుటద్దం ముందు నుంచుని డ్రెస్ చేసుకుంటూ వుంటుంది. ప్రక్కన యశోద.)

సు: యశోదా, ఈ చీరకీ బ్లౌస్ సరిపోయిందికాదూ? ఆ పూల వెధవని గులాబీపూలు తేరా అంటే తేనేలేదు. ఆయనకు గులాబీపూలంటే ఎంతో యిష్టం.

య: ఆ చీర కట్టుకుంటే అప్సరసల్లే వున్నావు తల్లీ నువ్వు. నీకంటే అందగత్తె లెవరున్నా రీ వూళ్ళో?

సు: చాల్లేవే నీ పొగడ్తలు! ఇవ్వాళ నటన నికేతనం వార్షికోత్సవమే. పట్టణంలో వుండే పెద్దవాళ్ళంతా వస్తారే స్వర్ణమాల నృత్యం చూడ్డానికీ. (గడియారం చూచి) "అయి దింటికి సరీగ్గా సిద్ధంగా వుండు. వీలుంటే నేనే వస్తాను. లేక పోతే కారు పంపుతాను రమ్మ"న్నారు. ఏ క్షణాన్నయినా వస్తారు.

య: ఎన్నాళ్ళయింది తల్లా, నువ్విల్లా పొంగిపోవడం చూసి! (బయట హారన్ చప్పుడు.)

సు: కారాగింది...వచ్చారేమో చూడు. (యశోద బయటికి వెళ్తుంది. సుశీల సవరించుకుంటూ వుంటుంది.)

య: (ప్రవేశించి) అయ్యగారు రాలేదమ్మా! అమ్మగార్ని తీసుకురారా అని నటేశాన్ని పంపేరుట. ఒంటరిగా అంత దూరం యెట్టా బోయొస్తావో తల్లీ!

సు: ఎంత పిచ్చిదానివే! ఇది బస్తీ. కారులో వెళ్తుంటే ఏం భయం వుంటుంది? తలుపు తాళంవేసి నువ్వు కూడా రారాదూ?

య: నేనూ వస్తే ఇల్లేమవుతుంది తల్లీ?

సు: అదీ నిజమే.

య: ఒంటరిగా ఎళ్తున్నావు తల్లీ, బద్దిరం. నా ప్రాణాలన్నీ నీ మీదే వుంటయ్ నువ్వొచ్చేదాకా.

సు: మన డ్రైవరే గాదుటే! ఎంత నమ్మకం లేకపోతే ఆయనట్లా పంపుతారు? వెళ్ళొస్తాను జాగ్రత్తగా వుండు. (వెళ్తుంది.)

య: (అక్కడున్న సుశీల చీర మడతబెడుతూ,) పిచ్చితల్లి! ఏమొచ్చినా పట్టలేదు.

(తెర)

# 12

(బిందు బంగళా—రాత్రి. బిందూ ఆదుర్దాగా పచారు చేస్తూ వుంటాడు. తడవ తడవకూ గడియారం వంక చూస్తూ వుంటాడు. శ్యామల ప్రవేశం.)

శ్యా: ఈ మాత్రానికే అంత ఖంగారు పడితే యిక ముందు జరగవలసిన దానికెంత ఖంగారు పడాలి? అనుకున్నదంతా సవ్యంగా జరిగింది. మధూ తాంబరంనుంచి బయల్దేరేడు. సరాసరీ మీ దగ్గరకే వస్తాడు. తొణక్కుండా బెణక్కుండా అతన్ని నిందించాలి.

బిందు: ఎక్కడుంది సుశీల?

శ్యా: అదంతా తరవాత చెబుతాను. ఆమె క్షేమంగా వుంది.

బిందు: అక్కడకు వెళ్ళి పెనుగులాడిందా? నటేశ మేడీ?

శ్యా: ఆ వివరాలన్నీ చెప్పడానికి టైంలేదు. నటేశం కారు పెట్టెలో వున్నాడు. మన యత్నం ఫలితమంతా మీరాడే నాటకం మీద ఆధారపడి వుంది.

బిందు: నాటకమే ఆడుతున్నాను. నా బ్రతుకు నాటకం లాగే వుంది. సరే వెళ్ళు.

శ్యా: మరేమీ కొంప మునగడంలేదు. చెప్పినట్లు చేయండి.

బిందు: (ఈజీచెయిరులో పడుకుని నిద్ర నటిస్తూ వుంటాడు. తొందరగా మధూ ప్రవేశించి)

మధు: బిందూ!బిందూ!కొంప మునిగింది. లే! త్వరగా!!

బిందు: (బద్ధకంగా లేస్తూ) ఏం మధూ! ఏం జరిగింది? ఏమిటా ఖంగారు?

మధు: ఆ నటేశంగాడేడీ! తాంబరం వెళ్ళి, ఇవ్వాళ నటన నికేతనం వార్షికోత్సవమనీ, నువ్వు రమ్మన్నావనీ చెప్పి నీ కారుమీద సుశీలను తీసుకువచ్చేడట!

బిందు; నటేశమా! ఎన్ని గంటలకి? ఆ సంగతి నాకు తెలియకుండా నీకెల్లా తెలిసింది? తెలియంగానే నువ్వు నాకెందుకు తెలియజెయ్యలేదు?

మధు: నేను నటన నికేతనంలో రిహార్సల్ చేయిస్తూ వుండగా ఎవరో టెలిఫోన్‌లో పిలిచేరు. ఎవరో స్త్రీ సుశీల నెత్తురు కక్కుకుంటోందనీ నీకుకూడా ఫోన్ చేశామనీ చెప్పింది. కాలహరణం చేయడానికి యిష్టంలేక సరాసరి వెళ్ళిపోయినాను. (ఇంతసేపూ బిందూ అతన్ని తీక్షణంగా చూస్తూ వుంటాడు.)

బిందు: నటేశం మూడు గంటలకు వచ్చేడు. ఇంతవరకూ నా దగ్గిరే వున్నాడు.

మధు: ఇది మరీ మోసంగా వుందే! ఇంకెవరయినా సశేశం పేరు జెప్పుకుని వెళ్ళలేదు గదా?

బిందు: కవివి గనక అనేక భావాలు కలుగుతున్నవి. మొన్న నువ్వక్కడ వుండగానేగా నేనూ వచ్చేను? సుశీల సశేశాన్ని చూసిందే? వేరే వొకడు వెళ్తే ఎట్లా నమ్ముతుంది?

మధు: నువ్వింత తాపీగా నన్ను ప్రశ్నించడం మరీ ఆశ్చర్యంగావుంది. వెంటనే పోలీస్ కంప్లెయింటు యిద్దాం రా!

బిందు: పైగా యిదొకటా? ఏమయిపోయిందని రిపోర్టు? బిందు మాధవరావుగారి భార్యా లేచిపోయిందనా? డ్రైవర్ను తీసుకు లేచిపోయిందనా? లేక నిన్ను తీసుకు లేచిపోయిందనా?

మధు: బిందూ! నీకేమయినా పిచ్చిపట్టిందా యేమిటి? ఏమిటామాటలు? సుశీల నన్ను తీసుకు లేచిపోవడ మేమిటి?

బిందు: ఎందుకు పోగూడదు? నీలాంటి తరుణుడు, నిత్యమూ వెళ్ళి సానుభూతి చూపిస్తూవుంటే ప్రేమలేని భర్తతో ఎన్నాళ్ళు కాపరం చేస్తుంది?

మధు: (దుఃఖంతో) బిందూ! ఇది ఆపత్సమయం. సుశీల ఏమయిపోయిందోనని ఆందోళనపడవలసింది పోయి, యీ నిందారోపణ లేమిటి? ఈ మాటలనడానికి నీకు నోరెల్లా వస్తోంది?

బిందు: నోరెందుకు రాదురా రాస్కెల్? పైగా వంగనాచి కబుర్లు చెప్తావేమిటి? ఏం చేశావు సుశీలను? చెప్పు!

మధు: (అర్థమైనట్లుగా తల మెల్లిగా కంపిస్తాడు.)

బిందు: ఏమిటా చూడ్డం? నీ వాలకం చూస్తుంటే నాకు లోపల అనుమానంగానే వుంది. కాని ఆబాల్యస్నే

హితుడవని నమ్మేను. నువ్వు పయోముఖ విషకుంభానివని నాకీ మధ్యనే తెలిసింది. పైగా పొట్టకోసం పనిచేసుకునే స్త్రీపరువుమీదనా యీ పాపంబండి నడిపిద్దామనుకుంటున్నావు.

మధు: బిందూ!

బిందు: నన్నికమీదట 'బిందూ' అని పిలవబోకు. నీకా యోగ్యత యేనాడో పోయింది. నమ్మి నాలోవున్న లోపాన్ని తెలియజేస్తే యింత ద్రోహం చేస్తావా?

మధు: బిందూ! కాస్త తాపీగా ఆలోచించు.

బిందు: ఆలోచించక్కర్లేదు. ఇది కేవలం నీ పనే. నేనక్కడికి రాకుండా వున్నంతవరకు మీ నాటకం సాగింది. నేనక్కడకు రావడంతోటే మీ ఆట కట్టుబడింది. నాకు తెలియదనుకున్నావురా మీ రాడీ కపట నాటకం? ఒక్క దెబ్బకు చస్తావు. (కుర్చీ ఎత్తి కొట్టబోతాడు.)

మధు: (కుర్చీపట్టుకుని) ఈ దుర్బుద్ధి నీకే కలిగిందో, ఎవరయినా కలిగించారో తెలియడంలేదు. (బిందూ మళ్ళీ కొట్టబోతాడు.) ఆగు! (బిందూ తోస్తాడు. మధుకు దెబ్బ తగులుతుంది.)

బిందు: నాలుగులక్షల కధికారిణి. మాలకన్నా యిదే మెరుగనుకున్నావా? లేవదీసుకుపోతే విడాకులిస్తాననుకున్నావా? నీ ఆటలు చస్తే సాగనివ్వను. (మళ్ళీ కొట్టబోతాడు.)

మధు: ఆవిడ విడాకులే యిస్తే యీ నాటకం ఆడేవాడినే కానేమో! ఆమెచేత విడాకులిప్పిస్తాను. కామాంధ కాలంలో ఆమెను హత్య మాత్రం చేయించకు. బిందూ! ఏం చేశావు సుశీలను?

బిందు: నేను హంతకుణ్ణిట్రా? (చెప్పుతో కొడతాడు.)

మధు: స్నేహితుడవని యింతవరకూ వూరుకున్నాను. నన్ను చెప్పుతీసుకుని కొడతావా! (బిందూ పైపట్టుకుని కొట్ట బోయి) క్షమించు. కామావేశం నిన్ను నీచుణ్ణి చేసినట్లే కోపావేశం నన్ను ఉన్మత్తుణ్ణి చేస్తున్నది.

బిందు: ఆఖరికి నామీద చెయ్యి కూడా చేసుకున్నావురా! ఈ హృదయం ఎంత మెత్తనిదో అంత కఠినమైంది కూడా. ఈ క్షణం నుంచీ నీకు నేను ఘోర శత్రువును. పో, నా యెదుటనుంచి.

మధు: ఈ స్థితిలో నీతో మాట్లాడి ప్రయోజనం లేదు. సుశీలను నేనే రక్షిస్తాను. రక్షించి తీరతాను. (వెళ్లిపోతాడు.)

బిందు: (కుర్చీలో కూలబడి) ఈ నాటకమంతా యెందుకాడుతున్నానో నాకే అర్థంకావడంలేదు. మాలా! మాలా!

న: (ప్రవేశించి) ఏమైందండి? ఏవో అరుపులు విని లోపల కొచ్చేనండి.

బిందు: (నటేశం వంకే పిచ్చిగా చూస్తాడు.)

న: అదేంటండి బాబుగారు అట్టా జూస్తారు?

బిందు· ఇప్పుడేమిట్రా చేయడం?

న: నా భార్యని నగలతో లేవదీసుకుని పోయినాడని కేసు బెట్టించండి. నామీద దొమ్మి చేశాడని కూడా కేసు పెట్టించండి.

బిందు: ఇవన్నీ నా వల్లగాదు. ఆ శ్యామలన్నే పిల్చుకుని రా, నాకేమిటో ఖంగారుగా వుంది.

న: కంగారెందుకండి? గేపు మధూని ఉద్యోగంలోనించి తీసేశానని అర్ధ రేయించండి.

బిందు: దాంతో మాలా గోషాల్ పని మానుకునిపోతే?

న: పోకపోతే యేమిస్తారండి?

బిందు: పోకపోతే మాలకు మధుమీద అభిమానం పోయిందనే అర్థం.

న: అమ్మగారున్నంచిన యింటికాడ సదుపాయాలన్నీ చేయాలండి. డబ్బయిపోయిందండి.

బిందు: అప్పుడే డబ్బయిపోవడ మేమిట్రా? శ్యామల పేర మూడు వేలకు చెక్కిచ్చానే!

న: ఆ యమ్మ నాకు కానీకూడా యియ్యలేదండి.

బిందు: మరి యిది అంతా యెల్లా నడిపించేవు?

న: నా చేతులో వుంటే ఖర్చుపెట్టేనండి.

బిందు: నీకంత డబ్బెక్కడిది?

న: మీలాంటోరిచ్చిందండి. బండి తోలుకున్నంత మాత్రాన అంత దిక్కులేకుండా వుంటామండి?

బిందు: ఇదంతా యేదో అగమ్యగోచరంగా వుందే! ఆ శ్యామల్నొకమారిల్లా పిల్చుకురా.

న: (పొగరుగా) చిత్తమండి.

బిందు: పరాత్పరా! (చేతుల్లో తలపెట్టుకుని కూర్చుంటాడు.)

(తెర)

# 13

(శ్యామల యిల్లు. శ్యామల నైట్ డ్రెస్‌లో మంచి హుషార్‌గా పాడుకుంటూ పక్కమీద పన్నీరుచల్లుతూ వుంటుంది. తలుపు తట్టినచప్పుడు.)

శ్యా: ఎవరది? (బయటికిపోయి మధుతో ప్రవేశిస్తుంది. మధు చాలా దీనంగా వుంటాడు. మాసిన గడ్డం, భుజంమీద ఒక తువ్వాలా, హాఫ్ఆరం చొక్కా, ధోవతి.) ఇదేమిటి? అంత ఆదర్శమూర్తులూ మనస్సు మార్చుకునే యింత పొద్దు పోయింతరవాత మా గృహపావనం చేశారా?

మధు; శ్యామలగారూ!

శ్యా: అదుగో! నాతో మాట్లాడదలచుకుంటే ఆ గారూ గీరూ మానేసి మాట్లాడాలి. తెలుసా! (కొంటె చూపు.)

మధు: శ్యామలగారూ! నేను మీ భ్రూవిన్యాసాలు చూచి ఆనందించడానికో మీతో శృంగారం నెరపడానికో మీ యింటికి రాలేదు.

శ్యా: (చురచురలాడుతూ) అందుకోసం వచ్చేరని నే నేమీ అనుకోడంలేదు లెండి! అందుకు మాకన్నా మంచివాళ్ళనే చేజిక్కించుకున్నారుగా?

మధు: ఎత్తిపొడువులకిది సమయంకాదు. దయచేసి సుశీల సంగతి మీ కేమయినా తెలిస్తే చెప్పండి.

శ్యా: ఓహో! ఇది మరీ చిత్రంగా వుందే! ఆవిడెక్క-డున్నదో చెప్పమని నన్ను మీరడగడం మరీ బాగుంది.

మధు: మీ ఆరోపణంతా నేనే సుశీలను తీసుకెళ్ళే.ననేగా?

శ్యా: అని నేననలేదే! ఎంతలేదన్నా నాలుగు లక్షల కధికారిణి !

మధు: శ్యామలగారూ! మీరూ స్త్రీ లే! నిజం తెలుసుకోకుండా...

శ్యా: (అర్థోక్తిలో) స్త్రీనిగాక మొగాణ్ణని ఎప్పుడూ చెప్పుకోడంలేదే? కాని, నేనే మొగాణ్ణయివుంటే, పండులాటి సంసారాన్ని యిల్లా నిలువునా పాడుచేసి వుండను.

మధు: నిజం తెలిసే యిల్లా నిందారోపణ చెయ్యదలచుకున్నవాళ్ళతో వాదించి యేం ప్రయోజనం? శ్యామలగారూ! ఏదో సంకల్పం మనస్సులో పెట్టుకుని, ప్రమాదకరమైన పరిస్థితులను మీరూ బిందూ కలిసి కల్పించేరు. అందువల్ల అనేక జీవితాలు నాశనం కాబోతున్నవి. ఇప్పటికయినా మించిపోయింది లేదు. దయచేసి సుశీల ఏమయిపోయిందో చెప్పండి.

శ్యా: నాకు తెలియకడుగుతాను, ఆమెను మీకు లేవదీసుకుని పోయివారని ఊరంతా గగ్గోలుగా వుంటే, ఆమె యేమయిపోయిందని వన్నడుగుతారేమిటి?

మధు: శ్యామలగారూ! ఎల్లుండి జరగబోయే నటుకు

నికేతనం వార్షికోత్సవం యివ్వాళేనని చెప్పి, నరేశం ఆమెను కారులో యెక్కించుకుపోయినాడని యశోద చెబుతున్నది. ఆమె నగలకాశపడి నరేశమే యీ పని చేశాడనుకోవచ్చును. కాని ధనాశతో యీ పని జరిగిందని నాకు తోచడంలేదు. ఆమెను దాచారో హత్యే చేశారో తెలియడం లేదు!

శ్యా: మీరెంత ఆదర్శమూర్తులైనా యింత అన్యాయం కూడదండీ! అనుభవం మీకూ నింద వాడికీనా!

మధు: శ్యామలగారూ, మిమ్మల్ని దీనంగా యాచిస్తున్నాను. దయచేసి సుశీల యెక్కడుందో చెప్పండి.

శ్యా: మీకెంత దైన్యమెందుకు! సుశీలను కాపాడాలంటే ఒకే ఒక మార్గం. ఆ స్వర్ణమాలతో, బిందూను పెళ్ళి చేసుకోమని చెప్పండి. ఆయన మీరేమడిగితే అది యిస్తాడు. ఆ ధనంతో మనమిద్దరం హాయిగా జీవితాలు గడుపుకోవచ్చును.

మధు: అంతకంటే ఉరితీసుకు చావడం మేలు. (ఆదుర్దాగా) ఆమెను హత్యచేయాలనే సంకల్పముందా ఎవరికయినా! ఇది బిందూ సహకారంతోనే జరిగిందా!

శ్యా: నేను చెప్పిన మాట వినకపోతే ఆమెను మీరే హత్యచేయించినవారవుతారు, ఏదో మధ్యలో బిందూ వచ్చేడు గాని లేకపోతే మనిద్దరం స్నేహితులమై వుండేవాళ్ళం. స్వర్ణమాల బిందూకు దొరికితే ఎవరికీ ఏ అపాయం రాదు.

మధు: దొరకకపోతే!

శ్యా: మీకు ఆమెను లేవదీసుకుపోయినాడనే నిందా తప్పదు. స్వర్ణమాలకు యిదివరకే సుశీలమీద అనుమానం వుండి వుంటుంది. అది మిమ్మల్ని ద్వేషించకా తప్పదు. ఇల్లా

జరుగుతుందనే ఆశతో తీసుకుపోయిన సుశీలను మళ్ళీ తీసుకు రావడానికి వీలుండదు గనక, ఆ తీసుకువెళ్లినవాళ్ళే ఆమెను హుజామత్ చేయకా తప్పదు. ఇదంతా సుశీలను మీరే తీసుకు పోని సందర్భంలో సుమండీ, నాకేమో తెలుసునని కాదు.

మధు: ఈ ఘోరకృత్యానికి బిందూ సహకారంకూడా వుందన్న మాట! ఎంత రాక్షసుడివై పోయినావు బిందూ?

శ్యా: ఏం చేస్తారు? దానిమీద మోజల్లా వుంది మరి! అందుకని మీరు నన్ను వివాహం చేసుకోండి. కడుపుమండి స్వర్ణమాల బిందూ దగ్గరకుపోతుంది. అప్పుడాయన సుశీలను తనే పిలిపించుకుంటాడు. రుక్మిణీ సత్యభామల్లాగా యిద్దరూ వుంటారు. చిలకా గోరింకల్లాగా మనమిద్దరమూ...

మధు: ఎంత యుగంధర ప్రజ్ఞ! నువ్వు డబ్బుకు గడ్డి తినే కులటవై పోయినావని జాలిపడేవాణ్ణేగాని హత్యాకాండ తలపెట్టే హంతకివని ఎప్పుడూ అనుకోలేదు. చెప్పు! సుశీల ఎక్కడుందో చెప్పు?

శ్యా: ప్రేమకోసం ఆడవాళ్ళేమయినా చేస్తారు మరి!

మధు: ప్రేమా! హ్హా! హ్హా! హ్హా! నీ 'ప్రేమ'కు బలి కావడంకంటె ఉరికంబమెక్కడం నూరురెట్లు మేలు. డబ్బు కోసం యింత రాక్షసానికి పూనుకుని ప్రేమకోసం చేశా నంటావా? 'ప్రేమ' అన్న పవిత్రాక్షరాలు ఉచ్ఛరించడాని కయినా నీ కర్హత లేదే? ఛీ! (వెళ్లబోతాడు.)

శ్యా: మధూ! మధూ! ఆగు, నా మాట విను. (మధు రివరివ వెళ్లిపోతాడు. శ్యామల అతనిమీద తువ్వాలు పట్టు కుంటుంది. అది ఆమె చేతిలో మిగిలిపోతుంది. శ్యామల

మంచంమీద కూలబడి ఆ తువ్వాలువంకే చూస్తూ) అత నన్నదాంట్లో అబద్ధమేమీ లేదు. మొదటినుంచీ సరీగ్గా నడుచుకుంటే ఎల్లా వచ్చేదో? ఇప్పుడు నా పని ఉభయభ్రష్టత్వమూ ఉపరిసన్యాసమూ అన్నట్లయింది. (లేచి బీరువా తెరిచి తన నగలన్నీ చూచుకుంటూ) ఇవన్నీ పోయిన గౌరవాన్ని మళ్ళీ తేగలవా? ఇప్పుడేడ్చి యేం ప్రయోజనం? (నటేశం ప్రవేశం.)

న: అదేంటమ్మా, అర్ధరాత్రివేళ ఆ నగలూ నట్రా జూసుకుని కన్నీళ్ళు బెట్టుకుంటున్నావు – రొట్టె నోట్లోబడిందని సంతోషించక?

శ్యా: (ఉలిక్కిపడి) ఇంత రాత్రివేళ నిన్నిక్కడికెవరు రమ్మన్నారు?

న: నాకు రావలిసిందేదో నా మొగానబారేస్తే నిద్ర మానుకుని నీ యింటి కెవరొస్తాడమ్మా!

శ్యా: నీకు రావలసిందేమిటి?

న: ఈ నాటకమాడ్డానికి రాజా యిచ్చిన డబ్బులో భాగం.

శ్యా: (ఆదుర్దాగా) నువ్వు రావడం మధు చూశాడా?

న: చూడకపోతే మాత్రం నువ్వు మా మంచిదాని వనుకుంటాడా? ఆయనట్లా వెళ్ళేడు నేనిటొచ్చాను. (మంచం మీద తువ్వాలు చూచి) కె. యం. ఆయన్దేనే. కానిక్కిం దిచ్చాడేమిటి?

శ్యా: కానుకగాదు గడ్డలు.

న: గడ్డలో బెడ్డలో నాకెందుగ్గానీ, (చేతితో రూపాయి మోగించినట్లుగా) డబ్బు!

శ్యా: సరే! నీ కివ్వడానికి నాదగ్గిరేమీ లేదు.

న: లేకేం? బిందూ యిచ్చిన చెక్కేమయింది?

శ్యా: నీకాయన బిందూట్రా?

నటేశం: ఏం, రంకుపెళ్ళాలు మాత్రమేనా (ఆడ గొంతుకతో) 'బిందూ' అని పిలవదగ్గవాళ్ళు? నా కియ్యాల్సిం చిస్తావా లేదా?

శ్యా: నీకియ్యాల్సిం దేమీ లేదని యెన్నిమాట్లు చెప్పాలి? వెళ్ళవతలకు.

న: లేదూ? (డ్రాయర్ మీదవున్న హేండ్ బేగ్ తీస్తాడు.)

శ్యా: (అతని చెయ్యి పట్టుకుని) ఆగు! ఆ సంచీ తెరిస్తే చస్తావు. (అని పన్నీరుసీసాతో కొట్టబోతుంది.)

న: నన్నే గొడదామనుకున్నా? (పెనుగులాడి ఆ సీసా తనే లాక్కొని శ్యామల నెత్తిమీద మొత్తుతాడు. శ్యామల క్రిందబడి విలవిలా తన్నుకుంటుంది. నటేశం అది గమనించ కుండానే హేండ్ బేగ్ తెరిచి) "పే శ్యామల ఆర్ బేరర్!" క్రాస్ చెయ్యలా నయమే. (అని శ్యామల వంక చూస్తాడు. ఆమె కదలదు. వంగి నాడి చూచి) దీన్దగలెయ్యా, చచ్చిందా? (ఖంగారుగా నలుదిక్కులా చూస్తాడు) గొడవే! (తువ్వాలు తీసి) ఇదిక్కడుంటేనే మంచిది. నేను పోయి శ్యామలమ్మింట్లో గడబిడ జరుగుతుందని పోలీసుకు టెలిఫోన్ చేస్తాను. (నగల వంక చూచి) ఇవ్వెందుకు వదలాలి? (హారాలు గాజులూ హేండ్ బేగ్‌లో కుక్కి అటూ ఇటూ చూస్తూ నిష్క్ర మిస్తాడు.) (తెర)

# 14

(స్వర్ణమాల యిల్లు.మాల చేతుల్లో పేపరు. గోపాల్ ఆలోచిస్తూ తిరుగుతూ వుంటాడు.)

స్వర్ణ: సుశీలగారు ఏమైవుంటుందంటావు గోపాల్?

గోపాల్: శ్యామలా బిందూ కలసి నటేశం సహాయంతో ఆమెను దాచేసివుంటారు.

స్వర్ణ: ఇల్లా చేస్తే వాళ్ళకు వచ్చే ప్రయోజనం?

గో: ఆ సందేహమే ప్రసాదరావుగారికీ కలిగింది. గురూజీ సుశీలమ్మని లేవదీసుకుపోయినాడని నింద మోపితే, నువ్వు యీర్ష్యతో కసువుమండి తనని పెళ్ళిచేసుకుంటావేమో ననే ఆశతో బిందూ యీ పని చేసివుంటాడు.

స్వర్ణ: ఛీ! జమీందారుగారు తనే యింత దుర్మార్గానికి పూనుకుంటాడని నమ్మలేకుండా వున్నాను. ఈ కుట్ర కంతటికీ ఆ శ్యామల దుర్బోధే కారణమనుకుంటాను.

గో: దాన్ని ఖూని చేస్తే బాగుండును ఎవరయినా.
(బయట ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభా, సుదేశమిత్రిరన్ అని చప్పుడు. పేపర్ లోపల బడుతుంది. గోపాల్ పేపరు తీసి, చదివి) ఇదేమిటి మాలా! శ్యామలనెవరో హత్యచేశారట. ఆమె యింట్లో గురూజీ ఇనిషియల్సువున్న తువ్వాలు దొరికిందట. రాత్రి గురూజీ ఆమెయింటికి వెళ్లడం చూచామని ఆ వీధిలోవాళ్లు చెప్పేరట. గురూజీని అరెస్టుచెయ్యమని ఆర్డరు వేశారట. ఈ గురూజీ దాని కొంప కెందుకెళ్లేరురా భగవాన్!

స్వర్ణ: (దుఃఖంతో) సుశీల సంగతి విచారించడానికి వెళ్ళివుంటారు గోపాల్. ఏం చేద్దాం గోపాల్? (ఏడుస్తుంది)

గో: దుఃఖపడి ఏం ప్రయోజనం మాలా! ఆ పరాత్పరుడే ప్రసాదరావుగారి రూపంలో గురూజీని రక్షించాలి. ఆయన గురూజీ యీ నేరం చేశాడని ఎంతమాత్రమూ నమ్మడు.

స్వ: పై అధికారులు ఆజ్ఞాపిస్తే ఆయనేం చేస్తారు?

గో: హత్యచేసే ప్రతివాడూ ఏదో సాక్ష్యం వదలిపెట్టి పోతాడు.

స్వ: ఈ హత్యతో గురూజీ కేసంబంధం లేదు గోపాల్. ఆయన కేవలం నిర్దోషి. ఆయన కేవలం నిర్దోషి!

(మధు ప్రవేశం.)

మధు: నేనే హంతకుణ్ణని నిరూపించడానికి చాలా సాక్ష్యం వుంది మాలా!

స్వ: గురూజీ! (అతని పాదాలమీద పడి ఏడుస్తుంది.)

మధు: ఇకమీదట నేనా గౌరవానికి తగను మాలా! ప్రసాదరావుగారు దయదలచి యీ అవకాశం యివ్వకపోతే స్వేచ్ఛాజీవిగా నిన్ను కలుసుకుండే అవకాశం కూడా వుండేది కాదు నాకు. నేనిప్పుడు హత్యానేరానికై అరెస్టు కాబొయ్యే నేరస్థుణ్ణి.

స్వ: మీరు నేరస్థులేమిటి గురూజీ?

మధు: ఏ భగవంతుడో అడ్డపడి, నా నిర్దోషిత్వాన్ని నిరూపించకపోతే యిదే నేను స్వేచ్ఛాజీవిగా నిన్ను కడసారి కలుసుకోడం. (కన్నీరు.)

స్వ: ధైర్యం వహించండి గురూజీ! నా ప్రేమ పవిత్రమైంది. నా ప్రేమ శక్తి మిమ్మల్ని రక్షించి తీరుతుంది.

మధు: కృతజ్ఞుణ్ణి! దురదృష్టం పండి నేను ఉరికంబం ఎక్కవలసి వచ్చినా ప్రేమార్ద్రములయిన నీ సుందర నేత్రాలు తలుచుకుంటూ ప్రాణాలు విడువగలను!

(ప్రసాదరావు, సంకెళ్ళు పుచ్చుకుని యిద్దరు పోలీసులు ప్రవేశం.)

స్వ: ప్రసాదరావుగారూ! (దుఃఖం.)

ప్ర: ఊర్కోమ్మా! డాక్టరుగారీహత్య చెయ్యలేదు. హంతకుడు పట్టుబడాలని నువ్వు భగవంతుణ్ణి ప్రార్థిస్తూవుండు. ధర్మం జయించి తీరుతుంది.

గో: సాక్ష్యం బలంగా వుంది గాదండీ! (మధు పాదాలు తాకి) మళ్ళీ భగవంతుడు నాకీ అవకాశం ఎప్పుడిస్తాడో గురూజీ! (దుఃఖం.)

ప్ర: నిన్న రాత్రినుంచీ నరేశం కనుపించడంలేదు. శ్యామలను హత్యచేయడమే కాకుండా హంతకుడు ఆమె నగలను కూడా అపహరించాడు. అది డాక్టరుగారి కనుకూలమైన విషయం. నరేశం యిల్లు సోదాచేయడానికి వారంటు అడిగేను. వాడే యీ పని చేసివుంటాడని నా నమ్మకం. కాని ఆ విషయం నిరూపించడానికి సాక్ష్యం కావాలి. అదృష్టవశాత్తు జమీందారుగారి యింట్లో పనిచేసే లక్ష్మి యీ వెంకటస్వామి మేనగోడలు. ఆమెవల్ల ఆచూకీ తెలిసింది. (మధుని చూచి) డాక్టర్‌గారూ! అనేకమార్లు నాకూ నా కుటుంబానికీ కూడా ప్రాణ దానం చేశారు. నా చేతుల్తోనే నా ప్రాణ దాతను అరెస్టు చెయ్యవలసి వస్తోంది. పోలీసువాడికీ అవస్థ ఎప్పుడో అప్పుడు తప్పదు.

మధు: విధికీ వ్యక్తిగతాభిమానాలకూ సంబంధమేమిటి ప్రసాదరావుగారూ! (చేతులు చాచి) వెయ్యండి. (ప్రసాద

శావు తల వంచుకుంటాడు. వెంకటస్వామి మధుకు సంకెళ్లు వేసి కళ్ళు తుడుచుకుంటాడు. వాళ్ళు బయలుదేరుతారు.)

స్వ: గురూజీ! గురూజీ! (దుఃఖం.)

గో: ఏం చేస్తాం మాలా! భగవంతుణ్ణి ప్రార్థిద్దాం.

స్వ: (రివరివా వెళ్ళి అద్దంముందు నుంచుని) అన్ని అనర్థకాలకూ యీ పాపిష్ఠి సౌందర్యం కారణం. దీనివల్లనే సుశీలమ్మకూ నా గురూజీకీ కూడా యిన్ని యిక్కట్లు చుట్టుకుంటున్నయ్! ఈ సౌందర్యం కోసమేగా ఆ జమీందారు యింత పాపానికి ఒడికట్టేడు! ప్రభూ! నా మధూని రక్షించు. ఆ ప్రయత్నంలో యీ వ్యర్థసౌందర్యం ఏమయిపోయినా ఫరవాలేదు.

గో: తొందరపడకు మాలా!

(తెర)

# 15

(ఒక పెద్ద గది. ఒక మూల మంచం, ఒక బల్ల, బల్ల మీద కూజా నీళ్లు, గ్లాసూ, దువ్వెనా, నూనె సీసా, అద్దం, సబ్బుపెట్టె, మంచంమీద తువ్వాలా వుంటవి.

(సుశీల మంచంమీద తల చేతుల్లో పెట్టుకుని ఆలోచిస్తూ కూర్చుని వుంటుంది.)

సు: ఎటు చూచినా మనుష్య సంచారమే కనుపించదు.

(నటేశం ప్రవేశం. సూటూ, టై, హేట్, వగైరాలతో.)

సు: (ఉలిక్కిపడి) నువ్వేనా? (కోపంగా.)

న: (తొణక్కుండా హేట్ బల్లమీద పెట్టి, బల్ల వంకచూచి) సౌకర్యాలన్నీ బాగానే చేశారు!

సు: ఎంత పొగరు! నన్నిక్కడికెందుకు తీసుకొచ్చావురా? నా భర్తకు తెలిస్తే బ్రతకనిస్తార్రా నిన్ను?

న: అవునండి! అయ్యగారు బ్రతకనీడన్నమాట నిజమేనండి!

సు: ఏమిట్రా ఆ వెటకారం! నన్ను నా భర్త దగ్గరకు తీసుకువెళ్తావా లేదా?

న: ఏమిస్తారండి తీసికెళ్తే?

సు: జైల్లో బడకుండా తప్పిస్తాను.

న: అబ్బో! శానావరకూ ఉందే. సరే! అట్లాగే తీసి కెడతాగాని యిట్లాగేనే బయటికి బోయేది?

సు: డ్రైవరు పనిచేసేవాడు మాట్లాడే విధమేనా యిది? నేనే నా దివాణంలో వుంటే నిన్ను నిలువునా చీల్పించి వుందును.

న: అందుకే అక్కణ్ణుంచి యిక్కడకు తీసుకొచ్చింది. డ్రైవరు పనిచేసేవాడికీ చేయించుకుండేవాడికీ యేమిటమ్మా భేదం? డబ్బా వేషమేగా? ఇదుగో ఈ డ్రై బాగుందీ?

సు: (వీడి వైఖరి వేరుగా వుందన్నట్లు చూస్తూ, కూజాలో నుంచి గ్లాసులో నీళ్లుపోసుకుని నటేశంవంక చూస్తూ వుంటుంది.)

న: ఇదుగో సుశీలమ్మా, నీకూ నాకూ లడాయెందుకు? అందమైందానివి. బతికి సుఖపడదగ్గదానివి. అట్లాంటి మొగుణ్ణి బెట్టుకుని నువ్వేం సుఖపడతావమ్మా! నువ్వు బ్రతికుంటమే ఆయనకిష్టం లేదే?

సు: నేను బ్రతికివుండటమే ఆయనకిష్టంలేదా? నన్నే ఆయన బందీని చేయించారా? నేను నమ్మను. నేనీ స్థితిలో వుంటే మా మధు ఏం చేస్తున్నాడో తెలియడంలేదు.

న: నువ్వు ప్రైవేటు జైల్లో వుంటే ఆయన పబ్లిక్ జెయిల్లో వున్నాడు.

సు: జైల్లోనా? ఎందుకు?

న: మీ యింటాయన నువ్వే నా పెళ్ళాన్ని లేవతీసుకు

పోయినావని నిందమోపితే మధూ చెయ్యిచేసుకున్నాడు. మీా ఆయన పోలీసుకు రిపోర్టు చేశాడు. ఆ కోపంలో మధు శ్యామలమ్మని ఖూనీ చేశాడు. జైల్లో దోశారు.

సు: మధూ నా భర్తమీాద చెయ్యిచేసుకున్నాడా? స్త్రీని హత్యచేశాడా? వారు ఖులాసాగా వున్నారా?

న: లేకేం? ఆణ్ణి ఖూనీజేసినా బాగుండేది, డబ్బున్న ఎదవముండవై పోయేదానివి.

సు: (విపరీతమైన కోపంతో) నోరుముయ్. (చేతుల్లో గ్లాసు విసిరివేస్తుంది.)

న: (తప్పించుకుని) తగలాలని కొడితేగా. ఇదుగో! ఆళ్ళెట్టా జస్తే మనకెందుగ్గాని నీ కళ్ళుజూస్తే సంప బుద్ధికావడం లేదు. మనిద్దరం హాయిగా–

సు: ఆరి దుర్మార్గుడా,నీకింత దుర్బుద్ధికూడా వున్నదా? నీకు తోబుట్టువులూ భార్యా లేదూ? వాళ్ళనిల్లా అవమానిస్తే నీ కెట్లా వుంటుంది?

న: అడగాల్సిన ప్రశ్న అడిగేవు. నా భార్యని నీ మొగుడులాంటి జమీాందారు చిన్నప్పుడే లేవదీసుకు పోయినాడు. అనాటినుంచి యీానాటి దాకా డబ్బున్ననాయాళ్ళనీ, డబ్బుకు గడ్డితినే ఆడాళ్ళనీ, ఏమేం జెయ్యాలో అన్నీ చేసేశాను. ఆఖరికి ఒక జమీాందారు పెళ్ళాన్నే పెళ్ళాంగా చేసుకుంటాను. దా! (సమీాపిస్తాడు.)

సు: ఆగు. కదలకు. చస్తావు!

(నటేశం సమీాపిస్తూనే వుంటాడు. సుశీల బల్లమీాద

వస్తువులు అతనిమీద ఒకటొకటిగా విసురుతూ వుంటుంది. నరేశం తప్పించుకుని సమీపిస్తానే వుంటాడు. సుశీల కెవ్వన కేకవేసి మూర్ఛిల్లుతుంది. బయట తలుపు పగలగొట్టిన చప్పుడు. నరేశం వెనక్కుతిరిగి జేబులోంచి చాకుతీసి చూస్తూ వుంటాడు. ప్రసాదరావు రివాల్వరు పట్టుకుని ప్రవేశిస్తాడు. నరేశం అతన్ని పొడవబోతాడు. ప్రసాదరావు రివాల్వరు పేలుస్తాడు. నరేశం క్రిందబడి కొట్టుకుని చచ్చిపోతాడు. ఒక కాన్‌స్టేబుల్ గ్లాసులో నీరు తెచ్చి సుశీల మొగమ్మీద కొడతాడు. ఆమె లేచి వెర్రిగా భయంగా చూస్తూ వుంటుంది. కాన్‌స్టేబుల్ నరేశం జేబులు వెతికి ఒక చెక్కుతీసి ప్రసాదరావు కిస్తాడు. అతని ముఖం వికసిస్తుంది.)

ప్ర: చచ్చాడ్రా?

కాన్: అవును సార్!

ప్ర: పీడా వదలిపోయింది.

సు: మీ రెవరు, పోలీసులా? (భయంగా.)

ప్ర: అవును తల్లీ!

సు: నా భర్త ఖులాసాగా వున్నారా? మధూని వురి తీస్తారా?

ప్ర: మీవంటి పతివ్రతల ఆశీర్వాదంవుంటే మధూజీకేఆపద వస్తుంది తల్లీ! వారికికమీదట యే భయమూలేదు. ఈ చెక్కుకోసం వీడే శ్యామలను ఖూనీ చేశాడు. పోతూ పోతూ ఆమె నగలు కూడా తీసుకుపోయినాడు. అవి వీడి యింట్లో కనుపించినవి. మీ ఆచూకీ తెలుసుకుంటానికి

శ్యామల యింటికి వెళ్ళిన మధూజీమీద ఆ నేరం పడింది. ఇన్నిం టికీ కారణభూతులు మీ భర్తగారు; ఇక వారి భరతం పట్టాలి.

సు: (చివాల్న లేచి) ఆయన్ను నిందించకండి యిన్ స్పెక్టరుగారూ! నేను వారిని ఏ విధంగానూ సుఖపెట్టలేక పోయినాను. అందువల్ల నే యీ అనర్థాలన్నీ చుట్టుకున్నవి. మీరు నా భర్తను సంరక్షిస్తానని అభయమివ్వండి. మీ కాళ్లు పట్టుకుని ప్రార్థిస్తున్నాను. (కాళ్లు పట్టుకోబోతుంది.)

ప్ర: (వెనక్కు జరిగి) తప్పుతల్లీ! తప్పు తప్పు! మీ పాదధూళితో పాపాలన్నీ పటాపంచలు చేయగల మహా పతివ్రతవు! నన్నాశీర్వదించవలసిన మహా తల్లివి!

సు: పతిప్రాణం సంరక్షణక్కై మీ పాదాలు పట్టుకుంటే తప్పేమీ లేదు. నా భర్తని రక్షిస్తానని వాగ్దానం చేయండి.

ప్ర: దోషిని విడిచిపెట్టడం నా విధికి విరుద్ధం కాదా అమ్మా!

సు: ఆయనే యీ దోషానికి కారణమని ఎల్లా నిర్ధారణ చేయగలుగుతున్నారు?

ప్ర: (ఆలోచించి) శ్యామల, నటేశం చచ్చిపోయిన తరవాత మీ భర్తగారే యీపని చేశారంటానికి సాక్ష్యమేమీ లేదు. అదీ మీ పాతివ్రత్యమహాత్యమే! ఇదే నిజమైన సత్యా గ్రహం!

మధూజీ స్థితికి మూల నుంచాన పడ్డది. డాక్టరుగారు జైల్లో మగ్గిపోతున్నారు. వెళ్ళి వారిని విడిపించాలి. రండి తల్లీ, పోదాం.

(తెర)

# 16

(బిందు బంగళా. బిందూ చాలా ఆందోళనగా అటూ యిటూ తిరుగుతూ వుంటాడు.)

బిందు: ఏం చెయ్యను? నేనేం చెయ్యను? సుశీల నెక్కడ వుంచారో కూడా తెలియదే? వాళ్లని నమ్మి దాన్ని గొంతుక కోశానే? సుశీలా! సుశీలా! ఏమయిపోయినావు సుశీలా! ఆ బాల్యస్నేహితురాలు! ప్రేమించిన ధర్మపత్ని. నేనెన్ని దురంతాలు చేసినా పల్లెత్తు మాటాడని పరమ సాధ్వి. ఏమయిపోయిందో సుశీల!...ఇప్పుడేమనుకుంటే యేం లాభం? ధనదాహంతో ఆ నటేశం దాన్ని కూనీయే చేశాడో లేక ఆమె రాణివాసాన్నే...పరాత్పరా! పరాత్పరా! నా సుశీలను రక్షించు! నా సుశీలను రక్షించు!

అది మహా పతివ్రత. దాన్ని ఏ దేవతలో రక్షిస్తారు... రక్షిస్తారా?...కామక్రోధాలతో ఎంతమంది కెన్ని అగచాట్లు తెచ్చిపెట్టేను? (కేలండరు వంక చూచి) ఇవ్వాళప్పుడే ఇరవై ఎనిమిది...రేపు మధూ కేసు విచారణ ప్రారంభం. నాకు ప్రాణ స్నేహితుడు! సోదర తుల్యుడు! నా కుట్రకు ఫలితంగా

కూనీ కేసులో యిరుక్కున్నాడు. ఏ భగవంతుడో కాపాడక పోతే ఉరికంబానికి బలై పోతాడు. ఛీ- ఎంత రాక్షస ప్రకృతి ఏర్పడింది నాకు?

(గోడమీదవున్న మాల ఫోటో చూస్తాడు.)

మాలా! నిన్ను నేను నిజంగా ప్రేమించాను. పిచ్చిగా వెర్రిగా ప్రేమించాను. నువ్వు నాకు దక్కకపోతే యింకెవరికీ దక్కగూడ దనుకున్నాను. నైరాశ్యంతో సర్వనాశనం తల పెట్టేను. నీ హృదయంలో విషం పోశాను. మాలా! మళ్ళీ నీ ముఖం చూచే ప్రాప్తం లేదు నాకు. మన్నించు! నన్ను మన్నించు!

(స్వర్ణమాల ప్రవేశం.)

స్వ: మన్నిస్తాను. నా మధూని రక్షిస్తే మన్నిస్తాను.

బిందు: (ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూచి నిశ్చేష్టుడై పోతాడు.)

స్వ: ఇదుగో! ఈ భౌతిక శరీరంకోసమేగా యిన్ని దురంతాలకు పూనుకున్నారు. ఇందుకేగా మీ భార్యను హత్యచేయించారు! ఈ తుచ్ఛశరీరం కోసమేగా నామధుని ఉరి కంబమెక్కిస్తున్నారు! నా హృదయం ఏనాడో నా మధుకి దత్తమైపోయింది. నా మధుని మృత్యుదేవత కబళించడానికి కాచుకూచున్నది. ఇదిగో యీ ఆత్మలేని శరీరాన్ని తీసు

కోండి! అనుభవించుకోండి! నా మధుని రక్షించండి! నా మధుని రక్షించండి!! (సమీపిస్తాంది.)

(బిందూ స్తబ్ధుడై నిలబడిపోతాడు. అతని కళ్ళవెంట నీళ్ళు జలజలా కారిపోతవి.)

బిందు: మధుని యింత ప్రేమించావా మాలా!

స్వ: ఇదుగో మాల! మధు ప్రాణసంరక్షణార్థమై మీ కామాగ్నిలో మాడి, మసైపోవడానికి సిద్ధమై వచ్చింది. మధు పోయింతరవాత యీ జీవితానికి అర్థంలేదు. ఆయన సేవలో యీ జీవితం నాశనంగానీండి. నా మధు ప్రాణాలు రక్షించండి!

బిందు: (వంగి ఆమె పాదాభివందనంచేసి) ప్రేమ దేవతా! నీ దివ్యప్రేమకు ప్రణామం. ఆ మహోత్కృష్టమైన ప్రేమకు అర్హుడు మధు! నేను కాను.

మధు నీవాడే కాదు. నా వాడు కూడా. నా మధూ ప్రాణాలు నా ప్రాణాలైనా ధారపోసి రక్షిస్తాను. కాని మార్గాంతరంతోచడం లేదు! మార్గాంతరం తోచడం లేదు!

స్వ: ఇంతచేసినా నా మధూని రక్షించుకోలేనా? (కూలబడిపోతుంది.)

బిందు: (ఏదో ఆలోచన తట్టినవాడిలాగా తలపంకించి బల్లదగ్గరకు వెళ్ళి గబగబా రాసి ఆ కాగితంతో స్వర్ణమాలను సమీపించి) ఇదుగో మాలా! సుశీలను నేనే శ్యామల దుర్బో

థతో అపహరించాను. పశ్చాత్తాపంతో శ్యామలను నేనే హత్యచేశాను అని వ్రాసి యిస్తున్నాను. ఇది పోలీసులకు చూపించి మన మధుని రక్షించు.

మధుతో నన్ను మన్నించమని చెప్పు. మధు మహా పురుషుడు. ఇంతచేసినా నన్ను మన్నించగలడు. నా మధుని నా ధర్మసంస్థలన్నింటినీ నిర్వహించమని చెప్పు. బ్రతికిన స్తే నా సుశీలను కూడా నన్ను మన్నించమని చెప్పు. నేను... మహా...దుర్మార్గుణ్ణి. బ్రతకదగ్గవాణ్ణి కాదు. (డ్రాయరు తెరిచి రివాల్వరు తీసి కాల్చుకోబోతాడు. స్వర్ణమాల పరి గెత్తుకు వెళ్ళి–)

స్వ: ఆగండి! అయ్యో! ఆగండి! (బిందు పెనగులాడ తాడు.)

(సుశీల, మధు, ప్రసాదరావులు ప్రవేశిస్తారు. సుశీల మధు వెళ్ళి బిందూ రెండు చేతులు పట్టుకుంటారు. ప్రసాద రావు రివాల్వరు లాక్కొని బల్లమీద పెడతాడు.)

మధు: ఏమిటీ అఘాయిత్యం బిందూ!

సు: ఏమిటండీ యిది, నేనేమైపోనండీ?

బిందు: (అందర్నీ తేరిపారచూచి సుశీలతో) నన్నింకా ప్రేమిస్తున్నావా సుశీలా!

సు: ఎంతమాటన్నారండీ!

ప్ర: సుశీలా డాక్టరుగారూ సత్యాగ్రహులండీ! హింసించినకొద్దీ ప్రేమించడమే సత్యాగ్రహం. బిందు మాధవ రావుగారూ! మీ భార్య మహా పతివ్రత!

బిందు: పతివ్రతేకాదు! దేవతా స్వరూపిణి.

(యశోద, లక్ష్మి, గోపాల్ ప్రవేశం.)

యశోద: మళ్ళీ కంటబడ్డావా మా తల్లీ! (సుశీలను కావిలించుకుని ఏడుస్తుంది.)

గోపాల్: (మధు పాదాలు తాకి) గురూజీ! గురూజీ!

ప్ర: (దూరంగా నుంచున్న లక్ష్మిని చూపించి) ఇంత ఆనందంగా యీ సంఘటన ఏర్పడడానికి యీ లక్ష్మి కారణం. ఈమె ఆచూకీ యివ్వకపోతే అంతా తారుమారయ్యేది.

(అందరూ లక్ష్మివంక చూస్తారు.)

బిందు: నా మానప్రాణాలు కాపాడేవా లక్ష్మీ? (నోట్లకట్ట యిచ్చి) చంద్రహారం చేయించుకో.

సు: (తన కంఠంలో హారంతీసి) మధూ! ఇది మాల మెళ్ళో వేయి. ఊఁ–ఇది నా ఆజ్ఞ!

మాలా! తలవంచు.

(మధు హారం మాల మెళ్ళో వేస్తాడు. అందరు చప్పట్లు కొడతారు.)

బిందు: ఇప్పుడైనా వప్పుకుంటావా, మాలను ప్రేమిస్తున్నానని?

మధు: అప్పుడే ఒప్పుకుంటే యింత జరిగేదికాదేమో ఒక్కొక్కప్పుడు ఆదర్శాలు ప్రాణమిమ్మాదకు తెస్తయ్!

బిందు: (ప్రేమతో) సుశీలా! (అని ఆమెవంక చూస్తూ వుండగా-)

(తెర)

అయిపోయింది.

## మనము-మన దేహస్థితి. ప్రథమ భాగము. శరీర ధర్మకాండ

400 పేజీలు. 75 చిత్రములు. వెల: రు 10 లు.

కొందరు వైద్యప్రముఖుల అభిప్రాయములు:—

",.....It will be of great value to general public..."
Dr. K. N. Rao, Director General of Health Services.

"......All the useful details are given...should be in every household."
Dr. T. S. R. Murti, M. B. M. S. (orth) U. S. A.

"......I have no hesitation in recomending this book for all courses leading to the preparation of Para—Medical Persons like Nurses, Midwives, Health visitors, compounders, etc...."
Dr. V. Ramachandra Rao, M. B. B. S. MSc.
Principal, R. R. College, Kakinada.

"......It would be useful for all those who would like to study Anatomy and Physiology of the Human system in Telugu..."
Dr. B. Venugopala Rao, M. B. B. S., M. S., D. L. O.
S. V. Medical College, Tirupathi.

"...is very suitable as text book for the under-graduates in Medical study and as a reference book for Medical Practitioners who did not have the benifit of having conventional Medical Education..."
Dr. M. V. R. Acharyulu, M. B. B. S.,
D. A. B. O. L., (U. S. A.), F. A. C. S., F. I. C. S.

మధురా పబ్లికేషన్సు, మద్రాసు-17.

